# రూమ్ టు లెట్

"రూమ్ టు లెట్" అని పెద్ద అక్షరాలతో ఇంగ్లీషులోనూ, "ఈ మేడమీదిగది అద్దెకు యివ్వబడును" అని చిన్న అక్షరాలతో తెలుగు లోనూ రాసి ఒకబోర్డు కనిపించింది. కావటానికి మేడే కాని నివసించటానికి ఎక్కువ వుపయోగంగా కనిపించలేదు నారాయణమూర్తికి. చెన్నపట్నం అంటే ఇంకా బాగా అనుభవం లేదు కనక మంచి గది అంటూ తిరుగుతున్నాడు మూడురోజులనుంచీ. ఎక్కితే ఆ రోజుకది తొంభై తొమ్మిదో మేడ అవుతుంది. కొంతదూరం సాగిపోయిగూడా, మళ్ళీ యెందుకు పుట్టిందో కాని ఆ బుద్ధి, వెనక్కు తిరిగివచ్చి సరాసరి మెట్లెక్కిపోయినాడు. ముందు వరండా వుంది. పక్కన మూడుగదులున్నయి. రెండుగదులు మూసివున్నయి. ఒక గదిమట్టుకు తెరిచిఉంది.

తెరిచివున్న గదివాకిట్లోకి వెళ్లాడు. ముందు అడుగు పెట్టడానికి సంకోచించాడు. ఎందుకొచ్చిందీకూడా మరిచిపోయి అట్టే నిలబడిపోయినాడు.

ఆ గదిలో 17, 18 ఏండ్ల పిల్ల వయ్యారంగా పడుకొని పాటలపుస్తకం చదువుకుంటూంది. ఆమె ఒక తెల్లమల్లు రవిక తొడుక్కుని ఉంది. ఆ తెల్లని రవికమీద 3, 4 పేటల గడియారపుగొలుసు జెట్రిపోతులాగా మెరుస్తూ పోయిపోయి అమాంతంగా ఆ మబ్బురంగు పమిటచెరుగుల్లో పడి మునిగిపోయింది.

నారాయణమూర్తికి ముఖమంతాగూడా పూర్తిగా కనిపించలేదు. ఒక యుద్రరాళ్ళ దిద్దు, ఒక మెరమెరలాడే బుగ్గ—చూస్తే లేతలేత కందెలు జ్ఞాపకంవచ్చినై, నారాయణమూర్తికి—బెంగాలీ బొమ్మల్లో మోస్తరుగా సగం తెరుచుకొని సగం మూసుకొని వున్న ఒక కన్ను, యివిమాత్రం కనబడ్డయి. వెంటనే నారాయణమూర్తికి love at first sight అయింది.

ఒక నిమిషమో అరనిమిషమో గడిచింది. ఆమెకు ఒకవిధమైన మగవాసన కొట్టినట్టుందని, వాకిలివంక చూచింది. చూస్తూండగానే చెయ్యి

దానంతట అది వెళ్ళి పమిటను సరిగా సర్దింది. ఆమె వెంటనే లేచి గదిలో ఒక మూలకు నక్కటానికి పోయింది.

నారాయణమూర్తికి తను వచ్చినపని అప్పుడు స్పృహకు వచ్చింది.

"ఏమండీ, ఇక్కడ అద్దెకుయిచ్చేగది యేది?" అన్నాడు.

"దీని పక్కది"—ఆమె నోటినుండి వచ్చిన ఆ వొక్కముక్కనూ నారాయణమూర్తి గొప్ప సంగీతంలో సంగతులు విన్నట్టు విన్నాడు.

నారాయణమూర్తికి గదిచూడటం అనవసరమనిపించింది. ఐనా ఏదో వొకటి చెయ్యాలి కనక ఆ గదివాకిలి దగ్గరికి వెళ్ళి తలుపునెట్టాడు. తలుపు రాలేదు. ఇంతలో నే గడియతీసినట్లు చప్పుడైంది. తలుపు తెరిచేటప్పటికి గడియతీసి త్వరత్వరగా వెళ్లుతూన్న ఆపిల్ల కనిపించింది. నారాయణమూర్తి వంక ఒక అరక్షణమో పాతికక్షణమో చూచి తలుపు దగ్గరగా వేసుకుంది. నారాయణమూర్తికి ఆ చూపులతో నే ఆశలు అంకురించినయి.

గది ఏం చూస్తాడు? తన చూపులన్నీ ఆ తలుపుమీద నే నిలిచిపోయినయి. గది తనది అయినట్లే భావించుకున్నాడు. గదికి ఒక్కటే కిటికీ వున్నప్పటికీ గాలీ వెల్తురూ పెద్ద అవసరాలుగా తోచలేదు.

గదిలో ఒకటి రెండు పెట్టెలూ, మాసిన కొన్ని చీరెలూ, రవికెలూ, ధోవతులూ, అవీవున్నయి. బహుశా గది ఖాళీగా వుందికదా అని అది కూడా వాడుకుంటూన్నట్టున్నారు.

గది చూడటం కొంచెం యెక్కువకాలమే పట్టింది. ఇంకా వుంటే బాగుండదని, ప్రయోజనంకూడాలేదని గ్రహించుకుని, వరాండాలోకి వచ్చాడు. ఇందాక తెరిచివున్న తలుపులుకూడా మూసిఉన్నయి.

కొంచెం నిస్పృహతో మేడదిగటానికి మెట్లదగ్గరకు వెళ్ళాడు. మళ్ళీ ప్రపంచాన్ని వుద్ధరించే ఒక గొప్ప idea తట్టినవాడిలాగా వెనక్కి వచ్చి "ఏమండీ, యీ గదికి అద్దె యెంత?" అని అడిగాడు.

నారాయణమూర్తి వాళ్లు యింటివాళ్లు కారనీ, వాళ్లుకూడా అక్కడ అద్దెకువున్నారనీ ఆలోచించక పోలేదు. కాని అప్పుడు అంతకంట వేయదగ్గ ప్రశ్న కనిపించలేదు.

"ఇంటివాళ్లు ఎదురుగుండావున్న ఇంట్లోవున్నారు" అనిజవాబిచ్చింది.

నారాయణమూర్తికి ఈ మాటలు తలుపుకు చాలా దగ్గరనుంచి వచ్చినట్లున్నాయి. అంతటితో ఆ పెద్ద idea కొస్తా చల్లారిపోయింది. తటతటమని పెద్దచప్పుడు చేసుకుంటూ మెట్లుదిగాడు-బహుశా తాను ఇంతటితో వదిలాడని చెప్పటానికని గామాల్ను.

*　　　*　　　*

నారాయణమూర్తి ఇంటివాళ్ళను అద్దె అడి కనుక్కున్నాడు. సూచనగా తక్కినభాగాల్లో అద్దెకున్నవాళ్లెవరో కూడా కనుక్కున్నాడు. గదికి ఒకరూపాయి బయానాయిచ్చి గది తనకు ఖాయం చేసుకొని బసకు బయలుదేరాడు.

దారిలో ఆలోచన మొదలుపెట్టాడు. చదువుకోటానికి వచ్చిననాడికి 12 రూపాయల అద్దె ఎక్కువే. అందుట్లో తనతండ్రి గుంటూరులో బి.ఏ. చదవమంటే ఒప్పుకోకుండా పట్నంవచ్చి ఇంత డబ్బు ఖర్చుపెడితే ఏమంటాడో? ఇంకొకర్ని కలుపుకోవాలె, తప్పదు. ముందస్తుగా బయానా ఇవ్వటం సమంజసంగా లేదు. ఐనా మిగిలిన తర్వాత చేసేది ఏమీ లేదు కనక త్వరగావచ్చి గదిలో ప్రవేశించటం మంచిదనుకున్నాడు. తర్వాత room-mate కుదరడా? కుదరకపోతే అప్పుడే చూసుకుందా మనుకున్నాడు.

ఇంతలోనే ఆమె విగ్రహం తనకళ్ళకు కట్టినట్లయింది. ఆమె అట్లానే పడుకొని చదువుతూంది. ఆమె కళ్లల్లో ఒక విధమయిన దీనత్వం కనిపించింది. వాళ్ళది బెజవాడట. ఆమె భర్త secretariat లో గుమాస్తాట. గుమాస్తాలందరికి ఉండే సామాన్య విశేషం ఏమిటంటే 50 సంవత్సరాలన్నా వుండటం. ఈ గుమాస్తాకు కనీసం 45 సంవత్సరాలన్నా వుండకపోవు. మన సంఘంలో చిన్నపిల్లల్ని ముసలివారికి యివ్వటం, ఇట్లాంటి దురాచారాలు చాలా వున్నవని తెలుసు కాని యింత ఘోరంగా పరిణమిస్తయి అనీ, ఇంతమంది బ్రతుకులు పాడుచేయగలవనీ నారాయణమూర్తి యిప్పటివరకూ వూహించుకోలేదు. ఇప్పుడు తన అనుభవంలోకి వచ్చినట్లయింది. ఆ దురాచారాలన్నిటికీ తాను ఒక్కడూ ఎదురుగుండా నిల్చి

న్నట్లయింది. తనలో ఉన్న శక్తులు కొన్ని అట్లా పారేశి ఇదంతా ఒక్క సారిగా అపేద్దామన్నంత వుత్సాహం పుట్టింది. ఆకళ్ళలో దీనత్వం పోగొట్టటానికి వేరేమార్గం కనిపించలేదు. తాను చేయగలిగింది ఒకటీ వెంటనే చేశాడు. అది ఏమిటంటే పెట్టె బేడాతో గదిలో ప్రవేశించటం.

* * *

రాత్రి 7గంట లైంది. నారాయణమూర్తి వరండాలో పచారుచేస్తున్నాడు. మెట్లెక్కి యెవరో వస్తున్నారు. 23, 24 సంవత్సరముల యువకుడు. సూటు, హాటు, బూట్లున్నయి; సుందరవిగ్రహం, జబర్దస్తీ మనిషి.

నారాయణమూర్తి వచ్చిందెవరో వెంటనే గ్రహించుకున్నాడు. ఎందుకో నిస్పృహ కలిగింది. తప్పకుండా ఆమె భర్తే ఐవుంటాడు. మన దురాచారాలు ఎట్లావున్నా యీ విషయంలోమటుకు ఆమెను ముసలి మొగుడికి ఇస్తే బాగుండేది అని తోచింది. ఆమె భర్తను అప్రయత్నంగా తనతో పోల్చుకున్నాడు. తన ఖద్దరులాల్చీ, తన ఖద్దరుధోవతీ, తన చామన చాయ రంగూ పోటీలో ఎంతమాత్రమూ నిలవవని నిశ్చయించుకున్నాడు.

అతను వచ్చే రావడంతోటే నారాయణమూర్తి కొత్త ముఖం చూచి పలకరించాడు.

“ఈ గదిలో ప్రవేశించారా యేమిటి?”

“అవునండి,” అని నెమ్మదిగా జవాబువచ్చింది. నారాయణమూర్తికి ఒకవిధమయిన ఫికరు యేర్పడ్డది. ఎందుకో తన సంగతి అంతా తన ప్లానులన్నీ, ఆమె భర్త కనిపెట్టేశాడని అతని తోచింది. మాట్లాడటానికే సిగ్గుపడుతున్నాడు.

“మీరు వొక్కరేనా?” అన్నాడు ఆమెభర్త.

ఇక్కడ ఒక చిన్నఅబద్ధం ఆడితే క్షేమమనుకున్నాడు నారాయణమూర్తి.

“కాదు, ఇంకోరుకూడా వున్నారు.”

“మం దేవూరు?”

“గుంటూరు.”

నారాయణమూర్తి మాట్లాడటానికి జంకుతున్నాడని ఆమెభర్త గ్రహించాడు. అడగదలుచుకున్న ప్రశ్నలు యింకా చాలా వున్నప్పటికీ అంత

టితో కట్టిపెట్టి తన గదిలోకి వెళ్ళి తలుపు వేసుకున్నాడు. లోపల భార్యా భర్తల సంభాషణ అస్ఫుటంగా వినపడ్డది నారాయణమూర్తికి.

నారాయణమూర్తి కూడా లోపలికి వెళ్ళి తలుపు వేసుకున్నాడు. పక్కపరిచి కొంచెంసేపు పడుకున్నాడు. నిద్రపట్టలేదు.

నారాయణమూర్తికి మళ్ళీ ఒక ఊహతట్టింది. రెండు గదులకూ మధ్య ఒక వాకిలివుంది. ఆ వాకిలి దగ్గరకు వెళ్లాడు. అదృష్టవశాత్తూ ఆ తలుపు చెక్కల్లో అక్కడక్కడ సందులు వున్నాయి. ఒక కన్నుతో ఒక సందు గుండా చూచాడు. మనుష్యులు ఎవరూ కనిపించలేదు. చక్కగా పక్క వేసిన మంచం కనిపించింది. ఇంకో సందులోనుంచి చూచాడు. ఒక పక్కగా రెండు పీటలమీద కూర్చున్నారు భార్యాభర్తలు; మధ్య వెండికంచంలో అన్నం పెట్టుకుని తింటున్నారు. కొంతసేపు చూడగా చూడగా విసుగేసింది. "ఛా! ఏమిటీ అవస్త!" అని వచ్చి పడుకున్నాడు. కాని నిద్ర పట్టలేదు. పదినిమిషాలు అయింది. ఒక అరగంట గడచినట్టుగా వుంది నారాయణమూర్తికి. ఎవరో పక్కమీదినుంచి నెట్టినట్టుగా వెళ్ళి మళ్ళీ చూచాడు.

ఆమె భర్త కుర్చీలో కూర్చున్నాడు. ఆమె దగ్గరగా నిల్చుని నోట్లో సిగరెట్టు పెడుతూంది. నిప్పుపెట్టె గీచి వెలిగిస్తూంది. నారాయణమూర్తి నాగరికత యింకా సిగరెట్లు కాల్చటందాకా రాలేదు. తెల్లవారగానే ఒక గోల్డుఫ్లేకుపెట్టె కొనుక్కొచ్చి అలవాటు చేసుకోటానికి నిశ్చయించుకున్నాడు.

ఆ రాత్రి నారాయణమూర్తి ఆందోళనకు అంతులేదు. అక్కడ వాకిలి దగ్గర నిల్చుని చూడ్డానికి మనోధైర్యం లేదు; ఇక్కడ పక్కమీద పడుకొని నిద్రపోవటానికి మనస్తాయి లేదు. చివరకు ఆమె లాంతరు తీసే వరకూగూడా అట్లానే గడిపాడు. ఏమీ కనపడకపోయినా చీకట్లోకూడా కొంతసేపు వాకిలిదగ్గర నిల్చుని చూపుకూడా సగం చెడగొట్టుకున్నాడు. చివరకు అయిష్టంతో వచ్చి పక్కమీద పడుకున్నాడు. కాని రాత్రంతా నిద్ర లేదు.

నారాయణమూర్తికి పెద్ద అఖాతంలో పడ్డట్లయింది. పగలు తీరిక లేదు, రాత్రి నిద్ర లేదు. ఆమె తన్ను ప్రేమిస్తున్నదా లేదా అనే మాట నిర్ధారణ చేసుకోటానికి వీల్లేకుండావుంది. ఆమె మొదటిరోజున తన్ను మాచిన చూపులతో అప్పుడప్పుడు చూస్తూ వుండటంవల్ల ఆశలు మారల మరల పుట్టుతున్నాయి.

భర్త ఆఫీసుకు వెళ్ళిం తర్వాత యెప్పుడన్నా వరాండాలోకి బజారు మొహం చూడ్డానికి వస్తుంది. అప్పుడు నారాయణమూర్తి కొంచెం వార వాకిలిగా వేసి ఆమెవంక చూస్తాడు. ఆమె యెప్పుడన్నా అకస్మాత్తుగా నారాయణమూర్తివంక చూచి కూడా చూడనట్టుగానే నిల్చుంటుంది. ఇట్లా కొంతసేపైన తర్వాత నారాయణమూర్తి వూరుకోక ఏదో పని వున్నవాడిలాగా వరండాలోకివస్తాడు. దాంతో ఆమె గదిలోకి పరిగెత్తు కొని వెళ్ళి తలుపు వేసుకుంటుంది. అప్పుడు నారాయణమూర్తికి యెందుకు వరాండాలోకి వెళ్ళా నా అనిపిస్తుంది. కాని చేసేది ఏమీలేదు. మళ్ళీ తలుపుల సందుల్లోంచి చూడటం.

నారాయణమూర్తికి ఒక పెద్ద అనుమానం, తను తలుపుసందులోంచి చూస్తున్నది ఆమెకు తెలుసునా తెలియదా అని. వూరికే అదే పనిగా చూడటం నిరుత్సాహంగా వుంది. ఆమెకు తెలియ జేయటం ఎట్లా? ఒక వేళ ఆమెకు యిదివరకే తెలిసివుంటే అది నిర్ధారణ చేసుకోటం ఎట్లా?

ఆమె జాకెట్టు మార్చేటప్పుడూ అప్పుడూ ఒక్కసారి తలుపు వంక చూస్తుంది యెవరన్నా వున్నారేమో అన్నట్టుగా. అప్పుడు నారాయణ మూర్తి ఆమె కళ్లు తన కళ్లల్లోకి చూస్తున్నట్టుగానే భావించుకొని, కొంచెం సిగ్గుపడి పక్కగా నిల్చుంటాడు.

ఇట్లాంటి పట్టు సమయాల్లో యెప్పుడన్నా కాలితోనో వేలితోనో చప్పుడు చేస్తాడు. దాని ఫలితం చూస్తాడు. ఆమె చప్పుడు ఏమీ విననట్లు గానే తన పనిమీద వుంటుంది. చప్పుడు విననట్లా? విని కూడా విననట్లు నటించటమా? నిర్ధారణ చేయలేకుండా వున్నాడు నారాయణమూర్తి. కాని 99 పాళ్ళు వినికూడా విననట్లే నటించట మనుకున్నాడు.

చూడగా చూడగా ఆమెకు తనయందు యేమో అభిప్రాయం వుంది అనే నిర్ధారణకు రాక తప్పిందికాదు నారాయణమూర్తికి. ఏ అభిప్రాయం వున్నా ఆడది కనక ఆమె ముందంజ వెయ్యలేదు. ఏ దారి తీసినా మొగవాడు తాను తీయవలసిందే. ఈ నిశ్చయానికొచ్చిన తరువాత మంచి సమయంకోసం యెదురు చూస్తున్నాడు నారాయణమూర్తి. రోజుకు 99 మంచి సమయాలు వచ్చి పోతున్నాయి. కాని నారాయణమూర్తి ముందు ఒక్క అడుగూ పెట్టలేకున్నాడు.

ఒక స్టేజిలో అనుకున్నాడు—ఇప్పుడు ఒకర్ని ఒకరం ప్రేమించుకుంటున్నాంగదా, ఒకరి దగ్గరగా ఒకరం వున్నాం గదా, ఇంకేం కావాలి? యీ విధంగా సర్వకాలం వుంటే చాలదా? ఆమెనూ, ఆమె జీవితమునూ అనేక కష్టాలపాలు చేయటం యెందుకు? ఆత్మలు యేకీభవించటం గాని కావాలిసింది. శరీరవాంఛ కాదు. కాని ఆమె యింత లోతుగా ఆలోచిస్తుందా? ఆమెది ఇంతకూ శరీరసంబంధమైన ప్రేమ కావచ్చును. ఇందాకా తీసుకువచ్చి నా ఆత్మను ప్రేమించమంటే, ఆమె నన్ను అప్రయోజకపు వాజమ్మ ననుకుంటుందేమో? కావున ప్రేమ సముద్రంలో నిండా మునగాలిసిందేనని నిశ్చయించుకున్నాడు.

ఒక వేళ ఆమె మూర్ఛించి, ఆమె అంతట ఆమే తన అవస్థను కనికరించి, భర్తలేని సమయంగా చూచి, ఏ మధ్యాహ్నమో, మధ్య తలుపుదీసుకొని అమాంతంగా తనగదిలో ప్రవేశించటానికి వుద్దేశిస్తుందేమో? అప్పుడు తలుపు గొళ్లెం వేసి వుంటే ఆటంకంగా వుంటుందని తనవైపు గొళ్లెం తీసే వుంచుతున్నాడు. కాని అట్లాంటి దేమీ సంభవించలేదు.

* * *

నారాయణమూర్తి ఆ గదిలో ప్రవేశించి 15 రోజులయింది. రెండు రోజులమట్టీ ఆమె కొత్తమార్గం అవలంబించింది. భర్త ఆఫీసుకు వెళ్లగానే పైగది తాళంవేసి కిందనే ఆ అరవవాళ్లతో మాటా పలుకూ ఆడుతూ కూర్చోటం, భర్త సాయంత్రం రాగానే అప్పుడు పైకి రావటం. ఆమె యీ మార్గం అవలంబించగానే మేడ అంతా బావురు మంటూంది నారాయణమూర్తికి. అయినా యే నిమిషాన పైకి వస్తుందో అవకాశం తప్పి

పోతుందని నారాయణమూర్తి ఒక్కడే బిక్కు బిక్కుమంటూ కాపలా కాస్తూ కూర్చోటం.

ఆ రోజు సాయంత్రం అయిదు గంటలయింది. ఇక విసుకేసి బీచికన్నా పోదాం అని నారాయణమూర్తి ముస్తాబై బయలుదేరాడు. మెట్లదగ్గర దాకా వెళ్లేటప్పటికి ఆమె మెట్లెక్కి వస్తూంది.

ఆమె స్నానంచేసి వస్తూన్నట్లుంది; చీరె అదోవిధంగా కట్టుకుంది; రవిక లేదు. నారాయణమూర్తి యెదురుపడేగానే మెట్లు దిగిపోవటానికి తానే వెనక్కు వచ్చాడు. ఆమె వచ్చి గదిలో జొరబడ్డది. తలుపు వార వాకిలిగా వేసుకుంది.

ఇంతకంటె మంచి సమయం దొరకదని నారాయణమూర్తి అనుకున్నాడు. కాని ధైర్యంలేదు. తాళంతీసి తన గదిలో ప్రవేశించి, తలుపు సందుల్లోంచి చూచాడు. ఆమె తెల్లని యిస్త్రీ చీరెతీసి కట్టుకుంటూంది. నారాయణమూర్తి చేతులూ కాళ్ళూ గజగజ వణికినయి. గుండె గబగబ కొట్టుకుంటూంది. వొళ్ళంతా వేడెక్కి ముక్కుల్లోంచి వేడి ఆవిరి బయటకు వస్తూంది. ఆ వుద్రేకంలో తలుపుమీద స్ఫుటంగా కొట్టాడు. పెద్ద చప్పుడు అయింది. ఆమె తలుపువంక ఆదేపనిగా చూస్తూంది. నారాయణమూర్తికివున్న అనుమానాలన్నీ పోయినయి. చేస్తే యేదన్నా వెంటనే చెయ్యాలెనని అనుకున్నాడు. చప్పున తాళం తీసికొని గదికి తాళం వేశాడు. తాళం వెయ్యటంలో వుద్దేశ్యం యేమిటో అతనికే తెలియదు. వెనకాముందూ ఆలోచించకుండా కూడా బయలుదేరాడు. ఆ గదివాకిలి పక్కకుండా నడుస్తూ ఆగకుండా సరాసరి మెట్లదగ్గిరకి పోయినాడు. మెట్లు సగం దిగాడు.

అక్కడ ఆగి తన పిరికితనానికి తన్నే నిందించుకున్నాడు. వాకిలి పక్కగుండా వస్తూన్నప్పుడు తలుపుసందుగుండా ఆమె కనిపించింది. ఆమెచీరె కట్టుకోటం అయింది. ఇంకా జాకెట్టు తొడుక్కోలేదు. బహుశా జాకెట్టుకోసం గామాలును పెట్టెలో వెతుకుతూంది. అప్పుడు అంత మంచి అవకాశాన్ని పోగొట్టుకోటం యేమీ బాగాలేదు.

మళ్ళీ ధైర్యంతెచ్చుకొని చప్పుడు కాకుండా మెట్లెక్కటం మొదలు పెట్టాడు. మెల్లిగా ఆమెగదిదగ్గిరకి వెళ్ళి తలుపు తెరిచాడు. ఆమె

వంగుని పెట్టె సవిరిస్తూనే వుంది. చప్పుడు కాకుండా గదిలో ప్రవేశించాడు. కాళ్లు వాటంతట అవే పోతున్నవి. అవి అతని అధీనంలో వుంటే మటుకు వాటిని వెనక్కి నడిపించేవాడే. కాని అతనికి తన మతి పని చేస్తూన్నట్లు కనిపించలేదు. ఇదంతా కలలో జరుగుతూన్నట్లుంది.

అట్లా ఆమెకు తెలియకుండా నిశ్శబ్దంగా నారాయణమూర్తి కాళ్లు నారాయణమూర్తిని ఆమె దగ్గరకు తీసుకువెళ్లితే, నారాయణమూర్తి చెయ్యి వెంటనే గజగజ వణుకుతూ దానంతట అదే ఆమె భుజంమీదికి పోయి వాలింది.

ఆమె భుజానికి చెయ్యి తగలగానే వులిక్కిపడటం--వెనక్కి తిరిగి నారాయణమూర్తిని చూడటం-కెవ్వుమని అర్థంలేని పెద్ద కేక వెయ్యటం-ఒక్కసారిగా జరిగినయి. సామాన్యంగా ఒక తాచుపాము మీదపడితే మానవుడు వేసే కేక వేసింది. ఆ బజారు అంతా వినపడి వుండవచ్చును.

నారాయణమూర్తి యేదో మాట్లాడాలని అనుకున్నాడు కాని అతని నోరు యెదురు తిరిగింది. పాపం కళ్లతో మటుకు ఒకక్షణం చూస్తూ నిల్చున్నాడు. ఆమెగూడా ఆ క్షణకాలంలో నారాయణమూర్తి కాళ్ళు వణకటం, చేతులు వణకటం, నోటమాట లేకపోవటం, ఆ బిక్కమొహం, ఆ కళ్లూ చూచి వుండొచ్చు.

ఇంతలోనే ఎవరో మెట్లెక్కి వస్తున్నట్లు చప్పుడయింది. నారాయణమూర్తి ఆలోచించటానికి టైములేదు, ఆలోచించే స్థితిలో గూడా లేడు.

అమాంతంగా తన గదిలోకి వెళ్ళే తలుపుగడియ చప్పుడు కాకుండా తీసుకొని గదిలోకి వెళ్ళి తలుపు వేసుకున్నాడు.

మరుక్షణమే ఒక అరవావిడ, దాసీ లక్ష్మి గదిలో ప్రవేశించారు. ఆ అమ్మాయిని చూచి "యెన్న ప్రమాదం?" అంది అరవావిడ.

ఇవతల గదిలో నారాయణమూర్తి సగం ప్రాణంపోయి వున్నాడు. కాని అవతల గదిలో యేమి జరుగుతూందీ ఆలకిస్తూన్నాడు. తన బతుకంతా ఆ అమ్మాయి చేతిలో వుంది. కాని ఆమె తన గౌరవం కాపాడుతుందని యేమీ ఆశలేదు; కాపాడటానికి ఆమెకు తగిన కారణాలూ లేవు. అన్నిటికీ సిద్ధమయి కూర్చున్నాడు. ఆమె జవాబు కోసం కొన వూపిరితో నిరీక్షిస్తున్నాడు.

ఆమె జవాబు చెప్పటానికి కొంచెం అవకాశం తీసుకుంది. దాసీ లక్ష్మి "ఏమీ, అమ్మగారూ, అంత కేక వేశినారు?" అంది. ఆమె తొణకకుండా జవాబు చెప్పింది. "ఏమీ లేదు, యీ పెట్టెలో గుడ్డలు సర్దుతుంటే తేలు కనిపించింది. నా వేలుకు అంత యెడంగా పోయింది. భయం వేసి కేక వేశాను. తేలు నన్ను కుట్టిందనే అనుకున్నాను. తేలు అంటే నాకు తగని భయం. గుడ్డల్లోకి యెటు పోయిందో మళ్ళీ కనిపించలేదు."

నారాయణమూర్తికి ప్రాణాలన్నీ లేచి వచ్చినయి. కాని యెవరన్నా ఆమెను నమ్మక తన గదిలోకి వచ్చి చూస్తారేమోనని భయంగానే వుంది. తాను గదికి తాళం వెయ్యటంగూడా బాగానే వుందనుకున్నాడు. అయితే ముఖ్యమయిన భయంమటుకు పోయింది ఆమె జవాబుతో. ఆమె కరుణాహృదయాన్ని యెంతో మెచ్చుకున్నాడు. ఆమెకు మనస్సులో యెన్నో నమస్కారాలు అర్పించుకున్నాడు.—

అవతల గదిలో వచ్చినవారిద్దరూ జాగ్రతగా పెట్టె అంతా ఖాళీచేసి చూశారు. గుడ్డలన్నీ ఝాడించారు. తేలు కనిపించలేదు. ఆమె "ఆ తేలు యెటో తప్పించుకుపోయింది. మీకెందుకు శ్రమ, వూరుకోండి" అంది. వారుగూడా వెతకటం ఆపి వెళ్ళిపోవటానికి సిద్ధమయినారు.

నారాయణమూర్తికి వారు గది ఖాళీచేసి పోవటం తప్ప మిగతా వెత కటం, దాంట్లో యెక్కువప్రాముఖ్యం లేదు. కాని వారు ఖాళీచేయగానే ఆమెకూడా మధ్యతలుపు గడియవేసి బయట తలుపు తాళం వేసి వారి వెంబడే కిందికి వెళ్ళిపోయింది.

నారాయణమూర్తి తాను ఖయిదీని అయిపోయినానని తెలుసుకున్నాడు. తాను ఖయిదీగా వుండటం ఆమెకుతప్ప ఇతరులకు తెలియదు. ఆమె అట్లా తాళంవేసి పోయిందికదా తన్ను యేమిచేస్తుంది? ఎందుకైనా సిద్ధంగా వున్నాడు నారాయణమూర్తి.

* * *

ఆ రోజు గడచిపోయింది. మరునాడు ఆదివారం అయింది. ఆమె భర్తకు ఆఫీసులేదు. ఇంట్లోనే వున్నాడు.

రెండుగంటల ప్రాంతంలో బాపట్లహోటలునుంచి ఒక మనిషి వచ్చాడు.

"ఏమండీ యీ గదిలో వుండే ఆయన యేమైనాడు? నిన్నరాత్రి భోజనానికి రాలేదు, యివాళ్ళ రాలేదు," అన్నాడు.

"ఏమో తెలియదు. నిన్న సాయంత్రంనుంచి గది అట్లా తాళంవేసి వుంది," అన్నాడు ఆమెభర్త. ఆమె మాట్లాడక సంబంధం లేనిదాని లాగా వింటూ నిల్చుంది. హోటలువాడు వెళ్ళిపోయినాడు.

అంతే—మళ్లీ నారాయణమూర్తి సంగతి యెత్తినవారు యెవరూ లేరు. ఆమెకు మనస్సులో ఏమివుందో ఏమో ఎవరికీ తెలియదు. మనిషిమటుకు మామూలుగాకాక అదోవిధంగా పరధ్యానంగా ఇంటిపనులు చేస్తూఉంది.

నారాయణమూర్తి అంతా చూస్తూనేవున్నాడు. కాని సాయంత్రం వచ్చేటప్పటికి నిల్చోటానికి కూర్చోటానికీగూడా శక్తిపోయింది. నారాయణమూర్తి ఆ గదిలోనే మెల్లిమెల్లిగా తన ప్రాణాలు అర్పించటానికి సిద్ధంగావున్నానని మొదట్లో అనుకున్నాడు గాని రానురాను అతని మనోనిశ్చయం పోయింది. తింటానికి యేమీ లేకపోంగా పైగా తాగటానికి మంచినీళ్ళన్నా లేవు. యెవరన్నా యిన్ని గుక్కెడు మంచినీళ్ళు ఇస్తే బాగుండునని తోచింది. శోషపోయి గదికి అడ్డంగా పడ్డాడు. పొద్దూకిందో తెల్లవారిందోగూడా తెలియదు.

భార్యాభర్తలు భోంచేసి పడుకునేప్పటికి 10 గంటలయింది. మామూలుగా ఆమెకు ముందు నిద్రపట్టేది, తర్వాత భర్త నిద్రపొయ్యేవాడు. ఇవ్వాళ్ల ఆమెకు నిద్రపట్టలేదు; నిద్రపోవాలని ప్రయత్నంగూడా చేయలేదు. 11 గంటల షుమారుకు భర్త నిద్రపోయినాడు.

భర్త నిద్రపోయింతర్వాత గూడా ఒకగంట వూరుకుంది. అప్పుడు ఆమె మెల్లిగా పక్కలోనుంచి లేచింది. ఒక వెండి గిన్నెలో చల్లా అన్నం కలుపుకుంది, ఒక గ్లాసులో మంచినీళ్ళు తీసుకుంది, చప్పుడు కాకుండా తలుపు గడియతీసి నారాయణమూర్తి గదిలో ప్రవేశించింది. పడివున్న నారాయణమూర్తిని చూచింది, నిద్రపోతున్నాడని అనుకుంది.

నారాయణమూర్తికి ఆమె వచ్చింది తెలియదు. కాని ఆమెదగ్గిరికి వెళ్ళగానే ఎవరో వచ్చినట్లు స్పృహకలిగింది. కళ్లు తెరిచి చూచాడు;

ఆమె విగ్రహం కనిపించింది. అదేమో తన మతిభ్రమ అనుకుని మళ్ళీ కళ్ళుమూసుకున్నాడు.

ఆమెగుండె నీరైపోయింది. చావటానికి సిద్ధంగావున్నా డనుకుంది. చేతులు పట్టుకుని మెల్లిగా కూర్చోపెట్టి, ఆ వెండిగిన్నె నోటిదగ్గర పెట్టింది. నారాయణమూర్తి అన్నం వాసన కొట్టగానే మళ్ళీ కళ్లు తెరిచాడు. తన మతిభ్రమ కాదు. ఆమెయే తన ప్రాణం కాపాడటానికి స్వయంగా వచ్చింది అని తెలుసుకున్నాడు. ఆమెకు నమస్కారం పెట్టి ఏదో మాట్లాడబోయినాడు. ఆమె వద్దు, ముందు అన్నంతినమని సౌంజ్ఞ చేసింది.

ఆ గిన్నెలో అన్నం తిన్నాడు. ఆ గ్లాసులో మంచినీళ్లు తాగాడు. శోషలోనుంచి తెప్పరిల్లుకున్నాడు. ఆమెకు నమస్కారం చేసి కాళ్లు పట్టుకుని "మీరు నన్ను క్షమించాలె" అన్నాడు.

ఆమె కొంచం దూరంగా వెళ్ళింది, మాట్లాడ లేదు.

"మీరు నాగౌరవమూ నా ప్రాణాలూ కాపాడారు. నేను మీ రుణము తీర్చుకోలేను," అన్నాడు.

"నేను ఇక్కడ నిల్చోటానికి వీల్లేదని మీకు తెలుసు. నా బుద్ధికి సమ్మతి లేకపోయినా పాపభీతివల్ల వచ్చాను. మీరు సోదరీభావంతో చూడడమే మీరు నాకు చేయదగ్గ ప్రత్యుపకారం. ఇక ఇక్కడవుంటే నా కాపరానికే ముప్పువస్తుంది, నేను పోతాను," అన్నది, ఆమె.

"నావల్ల మీకు ఇకముందు ఎట్టి ఇబ్బందీని రాదు, అది మీరు నమ్మండి. కాని మిమ్మని సోదరీభావంతో తలుచుకుంటాను అని చెప్పటానికి సంకోచిస్తూంది నా అంతరాత్మ. మిమ్మని ఒక దేవతవలె స్మరించుకుంటాను నేను బతికి వున్నంతకాలమూనూ. మిమ్మని ఒకటి కోరుతాను; మీ పేరు నాకు తెలియదు, మీనోటినుండి వింటానికి కుతూహలం పడుతున్నా" అన్నాడు.

"నా పేరు శ్యామల. మీ గది తాళంచెవి నాకివ్వండి, ఇక నేను వెళ్ళాలి; ఏదో కదిలినట్లు చప్పుడు అవుతున్నది," అని ఆదుర్దా పడ్డది శ్యామల.

నారాయణమూర్తి వెంటనే తాళంచెవి తీశాడు, శ్యామలచేతికి తన చెయి తాకుతుందేమో అన్నట్లుగా మెల్లిగా ఇస్తూంటే శ్యామల నారా

యణమూర్తి చేతిలో తాళంచెవి లాక్కుని అవతల గదిలోకి మాయ మయిపోయింది. శ్యామల చెయ్యి తన చేతికి తాకగానే నారాయణ మూర్తికి ఒక మెరుపు మెరిసినట్టుగా వొళ్ళంతా చలించింది.

నారాయణమూర్తికి వెంటనే వొళ్ళు తెలియని నిద్ర పట్టింది. బాగా తెల్లవారిం తర్వాత నిద్రలేచాడు. తన గది తలుపు తీసివుంది. తాళం, తాళం చెవి గడపలో పెట్టి వున్నై.

* * *

నారాయణమూర్తి ఆరోజు స్నానం చేసి వెళ్ళటం మళ్ళీ మర్నాడు మధ్యాహ్నందాకా రాలేదు. వెంకటేశ్వరా హాస్టల్లో గది కుదుర్చుకొని సామాను తీసుకు వెళ్ళడానికి బండితోసహా వచ్చాడు.

వాకిట్లో ఇంకో బండి వుంది. దాంట్లో శ్యామల భర్త సామాను పెట్టుతున్నాడు. నారాయణమూర్తిని చూసి పలకరించాడు.

"ఏమండోయ్, మీరుగూడా బండి తీసుకొచ్చారు, మీరుకూడా ఖాళీ చేస్తున్నారేమిటి? సరే, మనిద్దరికీ ఒకసారే కుదిరిందే లగ్నం! మీ రెండుకు అప్పుడే వెళ్ళుతున్నారుకీ" అన్నాడు.

"నాకు room-mate కుదరలేదు. అద్దె ఎక్కువ అవుతుందని వెంకటేశ్వరా హాస్టల్లో చేరానండీ" అన్నాడు నారాయణమూర్తి.

ఈ మాటలు అంటూండగానే శ్యామల లోపలినుంచి తాటాకుల బుట్టలో ఝూడీలు పెట్టుకొని వస్తూవుంది. ఆమెకుకూడా నారాయణ మూర్తి అన్న మాటలు వినపడినయి. ఆమెతో భర్త అన్నాడు, "చూచావా! ఆయనగారుకూడా ఇప్పుడే ఖాళీ చేస్తున్నారట. ఏవో నమ్మి కట్టామని ఇంటివారు అనుకుంటారేమో. పోనియి, మనం వుండి పోదామా ఏం?"

"నీ ఇష్టం!" అని మాట్లాడకుండానే లోపలికి పోయింది.

అప్పుడు శ్యామల భర్త నారాయణమూర్తితో రహస్యంగా అన్నాడు, "మా ఆవిడ హడావిడి అండీ ఇదంతా. ఆడవాళ్ళు, రామరామ ఏ నిమిషాన ఏది అనుకుంటే అది అయితీరాలె, చచ్చితీరాలె. మేం వెంకట రంగంపిళ్ళె వీధిలోకి వెళ్లుతున్నాము—25 నెంబరు. ఎప్పుడన్నా శెలవు రోజున అట్లారండి కులాసాగా."

# సంస్కరణం

మధురం లేచిపోయిందనే సంగతి మొదట యెవరు చెప్పారో జ్ఞాపకంలేదు. గాలిలో పరుగెత్తుకొచ్చినట్టు వచ్చింది ఖబురు. రమణ రావు లేవదీసుకు వెళ్ళాడో వెంకట్రావు లేవదీసుకు వెళ్ళాడో ఖాయంగా తెలియదు. కొంత మంది రమణరావు అనీ, కొంతమంది వెంకట్రావు అనీ, కొంతమంది ఇద్దరూ కలిసి అనీ.

అప్పటికి రెండు రోజులనుంచీ కాలేజీకి సెలవకావటంచేత నాకు వార్త వచ్చేటప్పటికి సాయంత్రం 5 గంటలయింది. అప్పటి కాలేజీలో పిల్లలందరికీ వాళ్ళో సగంమందికీ ముఖ్యవిషయం మటుకు పాకింది. దీంట్లో విశేషం యేమిటంటే మధురం బి. యే. జూనియరు చదవటమూ కాదు, మా కందరికీ కావలసిన క్లాసుమేటు కావటమూ కాదు, ఆమె మా ఇంగ్లీషు ప్రొఫెసరు రామనాథంగారి కుమార్తె కావడం. ఇట్లా జరుగుతుందనే సంగతి ఆయనకే కాదు కాలేజీలో మా కెవరికీకూడా తెలియకుండా మేనేజీ చేశారంటే మాకు బహు పెద్ద ఆశ్చర్యం వేసింది.

వాళ్ళ రూముకు వెంటనే పరుగెత్తాను. అది రామనాథంగారి ఇంటి దగ్గరగా వాళ్ళ బజారులోనే వుంది. గదిలో వెంకట్రావు వున్నాడు. అతని చుట్టూరా అయిదారుగురుమంది మన స్నేహితులున్నారు. నా వెనకటితేనే ఇంకా అయిదారుగురు వచ్చారు. ఇంతమంది వచ్చినందుకు కాదు కాని ఇంకా చాలామంది రానందుకు ఆశ్చర్యం వేసింది.

వెంకట్రావు పెద్ద హీరోలాగా కూర్చున్నాడు—తానే ఇంతపని చేసినట్టుగా, మొత్తంమీద యేమిచేసినా యేమి చెయ్యకపోయినా కొంత తెలిసివుండాలి అనుకున్నా మనిషి తరహానుబట్టి. వీడి దగ్గరనుంచి ఎట్లాగైనా ఇన్ఫర్మేషన్ లాగాలె.

"ఏమిటిది?" అన్నా.

"ఏమిటిది యేమిటి?" అన్నాడు వెంకట్రావు.

"మా దగ్గిర బుకాయించకు."

"అమ్మతోడు—ఎంతవొట్టు పెడితే అంతవొట్టు. మీదగ్గిర దాస్తానా? మీకెంత తెలుసునో నాకంత తెలుసు" అన్నాడు. కాని మేం ఎవ్వరం నమ్మలేదు. ఒకళ్లిద్దరం వుంటే ఏమన్నా చెప్పేవాడేమో. పది పది హేను మందిమి వున్నామాయను, కొంచెం సంకోచించినట్టు కన పడ్డాడు. కాని అక్కడ ఆఫాట్ల వొదిలిపెడితే కడుపుబ్బరంపుట్టి చస్తాడేమోనని కనికరించి నేనే ప్రశ్నలు వేసి లాగుదామని చూచాను.

"వాళ్లు లవ్ చేసుకుంటూన్నట్టు నీవు ఇదివరకు ఏమన్నా అనుమాన పడ్డావా?"

"ఆమె రమణగాడ్ని ప్రేమిస్తున్నట్టు కలలోగూడా అనుమానపడ లేను కాని రమణగాడూ నేనూ అస్తమానం మధురాన్ని ప్రేమిస్తాంటే వాళ్ళం. వాడు నాకు అందకుండా యెగర గొట్టేశాడు."

"రమణగాడు చివరమాటు యెక్కడ కనపడ్డాడు? ఎప్పుడు కన బడ్డాడు? ఒక్కడే కనపడ్డాడా? వీటికి సమాధానం చెప్పు."

"నాకేమీ తెలియదంటే నాదగ్గరనుంచే ఇన్ఫర్మేషన్ లాగాలెనని చూస్తున్నారే మీరు? సరే కానీండి. చివరమాటు రమణగాడిని ఈ రూము దగ్గర రాత్రి షుమారు 2 గంటలకు బండిలో మధురంతో కూర్చుండగా చూచాను. మీకు సంతృప్తి అయిందా?"

"వొరే! వీడికి అంతా తెలుసురో! మన్ని బుకాయించ చేస్తున్నాడ్రా!" అన్నాడు ఒకడు.

"మనకు అంతా చెప్పేదాకా వదిలి పెట్టొద్దురా!" అన్నాడు ఇంకోడు.

"వొరే, బ్రదర్! ఇహ లాభంలేదు చెప్పాలిసిందే" అన్నాను.

అప్పుడు వెంకట్రావు అన్నాడు—"మీరందరూ నే చెప్పేది పరమ రహస్యంగా అట్టే పెడదామని చేతిలో చెయివేస్తే నాకు తెలిసినంత మటుకూ చెపుతాను. రామనాథంగారుగూడా అడుగుతే నాకేమీ తెలియదని ప్రమాణంచేసి చెప్పాను. ఏమిటి, మీరందరూ ప్రామిస్ చేస్తారా?"

మేము యావన్మందిమీ తప్పకుండా రహస్యంగా అట్టే పెడతామని తలలువూపాము. అప్పుడు వెంకట్రావు వూసగుచ్చినట్టు అంతా చెప్పాడు.

మన రమణగాడి సంగతి మీకు తెలుసుగా—ప్రతి ప్రొఫెసరు ఇంటికి వెళ్ళటం, దణ్ణాలుపెట్టి వస్తూంటం.

ఇట్లాఉంటే అసలు మూలం ఎట్లావచ్చిందంటే వారంరోజులక్రిందట వీడు వాళ్ళింటికి వెళ్ళినప్పుడు మధురం "కీప్స్" యివ్వమని అడిగింది. సరేలే అన్నాడు. అన్నవాడేంచేశాడు, ఆ పుస్తకం సరిగా ఇవ్వక దాంట్లో ఒక వుత్తరం పెట్టాడు. అప్పుడు నాతో ఆలోచించకుండా నాకు తెలియకుండాచేశాడు. దాంట్లో ఏమని రాశాడు, "Dear M. I love you." అని ఒక ముక్క రాసి దాంట్లో పెట్టాడు. ఆ పుస్తకం యిచ్చేశాడు.

అప్పటినుంచీ ఏంచేశాడూ ఆ యింటిముందరగా, వెళ్ళదాం రారా అంటే రాడు. అసలు కాలేజీకూడా రెండురోజులు యెగ్గొట్టాడు. ఏదో పెద్దభారం తనమీద పడ్డట్టుగా దిగాలపడి కూర్చున్నాడు. ఏమిట్రా అంటే యీ కొత్త ముక్క బయటపెట్టాడు. ఇహ వీడ్ని కాలేజీలోంచి డిస్మిస్ చెయ్యటం ఖాయం అనుకున్నా.

కాని అంతమటుకూ ఏమీ బయటకు రాలేదు. మధురంమటుకు నన్ను చూస్తే సురసురలాడుతూ మొహం అటుతిప్పుకునేది. అప్పుడు అనుకున్నా ఇది వుత్తరం సంగతి ఎవరికీ బయటపెట్టలేదని. పైగా రామనాథంగారు నన్ను పిలిచి "రమణరావు రాలేదేం?" అని అడిగాడు. "ఏదో వొంట్లో కొంచెం సుస్తీగావుండి రాలేదండీ," అని తడుముకోకుండా చెప్పాను. "అలాగా, పాపం! రేపు ఒక్కసారి మాయింటికి రమ్మన్నానని చెప్పు" అన్నాడు. అక్కడితో నాకు మరికొస్త ధైర్యంవచ్చింది. ఈసంగతంతా రూముకువచ్చి రమణగాడితో చెప్పాను.

వాడికీ ధైర్యంవచ్చింది. చావుతప్పి కన్నులొట్టపోయి బయటపడ్డాట్లో లేదో అప్పటే మొదలుపెట్టాడు మధురానికి తనమీద ప్రేమవుందనీ, ఆ సంగతి తనకు మొదటినుంచి తెలుసుననీ యీ విధంగా. అప్పుడు నేను గదమాయించాను. "చాల్లే, వెధవా, నోరుమూసుకొనివుండు. లేకపోతే నేనే వెళ్ళి ఆ రామనాథంగారితోనూ ప్రిన్సిపాలుతోనూ చెప్పి, మధురం

చెయ్యటానికి జంకుతూన్న పని నేను చేసివస్తాను.'' అంత గట్టిగా చెప్పిన తర్వాత నోరు మూసుకున్నాడు.

మొన్నాడు పొద్దున రామనాథంగారు పిల్చారు. వెళ్లగా అంతే కదలడే! ''నేను వెళ్ళను. ఏదో ప్రయివేటుగా దొబ్బులు పెట్టటానికి రమ్మన్నాడు'' అంటాడు. రామనాథంగారి చేతనో లేకపోతే మధురం చేతనో దొబ్బులు పెట్టిస్తేనే బాగుంటుందని నాకు తోచింది. అందుకని పూరుకోక వాడు వెళ్లేదాకా చంపాను. ఇహ వాడు తప్పని సరిగా బయలుదేరాడు!

* * *

రమణ వెళ్ళి వరండాలో నిల్చుని ''రామనాథంగారున్నారా?'' అని ఎవరికన్నా వినపడుతుందేమో అన్నట్టు నెమ్మదిగా అడిగాడు. అదృష్ట వశాత్తూ మధురం పక్కగదిలోనే వుంది. ''లేరు'' అని జవాబు చెప్పింది. బతికి బయిట పడదామని చూస్తుండగా మధురం యెవరో చూట్టానికి బయటకువచ్చింది. చూస్తే వీడు; తప్పించుకు పారిపోతున్నాడు. ''మిస్టరు, ఇట్రా'' అంది మధురం. చేతులూ కాళ్ళూ చల్లబడ్డయి రమణగాడికి. మెల్లిగా గదిలోకి వెళ్ళాడు. పుస్తకమూ వుత్తరమూ తీసి—

''ఏమిటీ వుత్తరం?''

. . . . . . . . . . . .

''ఇట్లా వుత్తరాలు రాయకూడదని నీకు తెలియదా?''

. . . . . . . . . . . .

''మన ప్రిన్సిపాలు యెంతమందిని డిస్‌మిస్ చేశాడు?''

. . . . . . . . . . . .

''ఈపాట్లు యీవుత్తరం మానాన్నగారికి చూపిస్తేచాలు. నీవు ఏమవు తావో ఆలోచించుకున్నావా?''

. . . . . . . . . . . .

''నీవు బి.ఏ. చదువుతున్నావే, ఇంతమాత్రంజ్ఞానం లేకపోయిందా?''

. . . . . . . . . . . .

''ఎప్పుడూ యిట్లాంటి పని చేయనని ప్రామిస్ చేస్తావా?''

............

"లేకపోతే దీన్ని యిప్పుడే మా నాన్నగారి కిచ్చి ప్రిన్సిపాలుగారికి పంపించనా?" అంది మధురం.

ఇంతవరకు రమణగాడు ఒక్కమాట గూడా మాట్లాడలేదు. బెల్లం కొట్టిన రాయిలాగా వింటూ దూలాలవంక చూస్తూ నిల్చున్నాడు. ఇప్పుడు తప్పని సరిగా మధురాన్ని క్షమాపణ కోరి తన ప్రాణం కాపాడుకోవలసి వచ్చింది. "తెలియక చేశాను, నన్ను నీవు యేంచేసినా సరే" అన్నాడు. వాంట్లోగూడా కొంచెం నియోగం.

మధురం ఆవుత్తరం తానే చింపి ముక్కలు ముక్కలుచేసి పుస్తకం రమణగాడికి యిచ్చి "యీతడవకు తప్పించుకున్నావు. ఇహ కబడ్దారీగా వుండు" అన్నది.

దాంతో మనవాడు బతుకు జీవుడా అని బయటపడ్డాడు. రూముకు వచ్చేటప్పటికి సగం ప్రాణాలు చచ్చి వచ్చాడు. ఏమయిందిరా అంటే ఎంతసేపటికీ చెప్పడు. నేను వాణ్ణి బెదరించి జరిగిన కథ అంతా లాగాను. తగిన శాస్తి అయింది కదా అని సంతోషించాను.

ఈకథ యింతటితో ముగిసింది కదా అనుకుంటే ముగియలేదు. తలవని తలంపుగా కొత్తకొత్త డెవలప్మెంట్స్ వచ్చినయి మొన్నాటి కల్లా.

* * *

మొన్నాడు రాత్రి—అంటే నిన్నరాత్రి అన్న మాట—రమణగాడు యిదంతా ఇట్లా వచ్చిందనీ ఇట్లా చెయ్యబోతున్నామనీ నాతో వచ్చి చెప్పిందాకా నాకేం తెలియదు నమ్మండి.

బి. యన్. రావు, ఐ.సి.యస్. ఒకాయన వున్నాట్ట. బహుశా మీకు తెలియదు. ఆ రావుగారికీ యీ రామనాథంగారికీ కొంత ముఖాముఖీని కొంత పోస్టుద్వారానూ వుత్తర ప్రత్యుత్తరాలు జరిగినయి. నిన్న పోస్టులో ఆ రావుగారి దగ్గరనుంచి ఓవుత్తరంవచ్చింది. దాంట్లో "మీమధురం నాకు నచ్చింది. వివాహం చేసుకోటానికి వొప్పుకున్నాను. 10 వ తారీఖున పెళ్ళిచేసుకోటానికి వస్తున్నా" అని రాశాడు.

అంతవరకూ మధురానికీ తల్లికీ ఈ పెళ్ళి ముచ్చటేమీ తెలియదు. రామనాథంగారు ఏమీ ఖాయం కానిది ఎందుకులే ముందస్తిగా చెప్పటం అని వూరుకున్నాడు. బి.యస్. రావుగారు రెండు వారాలక్రిందట పెద్ద హడావిడిగా వచ్చి రామనాథంగారి ఇంట్లో ఒకరోజు వుండి మధురాన్ని చూచి పోయినాడుగాని ఇంట్లో వాళ్ళకి యిందుకు వచ్చాడని ఏమీ తెలియదు.

రామనాథంగారు యీ వుత్తరం చదువుకోగానే మధురమూ తల్లీ భోంచేస్తూంటే వచ్చి అన్నాడు "ఏమే, మన మధురానికి గొప్ప సంబంధం కుదిరింది. రెండువేల రూపాయల జీతగాడు—మన అమ్మాయిని చేసుకోడానికి వొప్పుకున్నాడు."

"అంటే మొన్న పదిరోజులనాడు మనఇంటికి వచ్చిన ఆయనా ఏం?"

"అవును. ఆయనే!"

"సరేలే—నల్లగా తుమ్మమొద్దులాగా—యాభైయేళ్ళన్నా వుండవూ ఆయనకూ? ఇంతకూ మన మధురాన్ని కనుక్కున్నారా? ఈడువచ్చిన పిల్ల, పెద్ద చదువు చదువుకుంటూంది—మనంగూడా అందరి మోస్తరుగా చేస్తే నవ్వుతారు."

"నీవు ముందస్తిగానే దానికి నేర్పు. దానికిమటుకు తెలియదా ఏమిటి? నెలకు రెండువేలు వస్తూవుంటే ఎవరన్నా వద్దంటారూ?-యేమే అమ్మా, నీ అభిప్రాయం యేమిటి?"

ఇంతవరకూ తల్లిదండ్రుల సంభాషణ తలవంచుకుని వింటున్నది మధురం. అధాట్టుగా రామనాథంగారు యీ ప్రశ్న వేశేటప్పటికి తనకు జవాబు దొరకలేదు. అసలు చిన్నప్పటినుంచి తండ్రి అంటే కొంచెం బెరుకు. అందుట్లో ఇట్లాంటివిషయాలు తండ్రితో ఎప్పుడూ మాట్లాడి యెరుగదు. కనక మౌనమే అవలంబించింది. ఆ మౌనాన్ని అంగీకారంగా తీసుకున్నాడు రామనాథంగారు.

"ఆయన 10వ తారీకు పెళ్ళిచేసుకోటానికి వస్తున్నాడు కనక మనం సిద్ధంగా వుండాలి. ఏముంది, శివిల్ మారేజి చేశేద్దాము అన్నాడు."

"సరేలే! అప్పుడే ఇందాకావచ్చిందీ? మొత్తంమీద మీదండీ నేర్పు.

ఇంట్లో నేను ఇంకా చచ్చాగదా, నాతో అన్నా చెప్పరాదూ? ఎవడి కొక్కవాలె, మీ ఇష్టం వచ్చినట్టు చేసకోండి తండ్రి కూతుళ్లు'' అంది.

''నీ దొక యేడుపు. ఇప్పటి సంగతులు ఏమీ తెలీయవు. పెద్దదాన వైనావు. నీ కెంగకు వూరుకోవే అంటే పుంటుకోవు వెధవగోల'' అన్నాడు.

''చాల్లెండి మీ మాటలు. నేను ముసలిదాన్నయితే, ఎవరన్నా చిన్నదాన్ని పెళ్ళిచేసుకోండి. ఈడూజోడూ గా వుంటారు.''

''ఇక చాలు నోరుమూసుకో.''

*　　　*　　　*

సాయంత్రం నాలుగయింది. టెన్నిసు ఆడుకుందాంగదా అని రమణా నేనూ కాలేజీ కెళ్ళాం.

''ఏదో మీటింగ్ లేవుంది. ఒకసారి లోపలికి వెళ్ళొద్దామా యేం?'' అన్నాడు రమణగాడు.

''నాన్సెన్స్, ఏమిటి వెళ్లేది? టెన్నిసు ఆడుకుందాం లేద్దు'' అన్నా.

''అట్లాకాదు, వూళ్ళో ఆడజనం అంతా వచ్చారు. ఒక్కసారి వెళ్ళి చూస్తే మర్యాదగావుంటుంది'' అన్నాడు వాడు.

చేతుల్లో బాట్లు ఆడించుకుంటూ కాలేజీహాలుకు దారి పట్టాం.

దాంట్లో ఓ పెద్దమీటింగు. గొప్పగొప్ప సంఘసంస్కర్తలం అనుకునే వాళ్లంతా చేరారు. మొగవాళ్లతో ఆడవాళ్లతో కిటకిట లాడుతూంది హాలు. మా ఇద్దరికీ కష్టంమీద లోపల నిల్చోటానికి చోటు దొరికింది.

రామనాథంగారు అప్పటికి అరగంట సేపటినుంచీ ప్రెసిడెన్షల్ ఎడ్రస్ యిస్తున్నారు.

''ఈ వివాహాలవల్లకలిగే ఘోరాలు ఇంతకంటె ఇప్పుడు యెక్కువగా విశదీకరించటం అనవసరమని నేను గట్టిగా వూహిస్తాను.

''ఇటీవల జరిగిన సెన్సెస్ ప్రకారం యిండియాలో సంవత్సరానికి 4,250,000 బాల్యవివాహాలు జరుగుతూన్నయిఅని, అందులో 3,240,000 మందిబాలవితంతువులు అవుతున్నారని, అందులో 150,000మందికి పునర్వివాహాలవుతున్నయి అని తేలింది. చూచారా, గుండె బద్దలయిపోతూంది.

"అలాంటివన్నీ రూపుమాసి ఇండియాలోంచి పోవాలంటే, హిందూ దేశంలో స్త్రీలకు పునర్వివాహం, విద్య, స్వేచ్ఛ—ఇవి ముఖ్య అవసరాలు. స్వేచ్ఛ అనగా స్వతంత్ర•బుద్ధి; అనగా స్వతంత్రశక్తి, అనగా free and independent thought........."

ఇట్లా పోతూంది ధోరణి రామనాథంగారికి. పోతూంటే "యిహ చాల్లేరా! డబ్బాలాగా వుందిరా!" అన్నాడు రమణగాడు.

కాని హాలంతా నిశ్శబ్దంగా వుంది. ఆయన్ను చూసి అయితేయేం, ఆయన లెక్చరు చూసి అయితేయేం. రామనాథంగారంటే గొప్ప సంఘ సంస్కర్త. చిన్నప్పుడనంగా బ్రహ్మసమాజంలోచేరి జంధ్యం బొట్టు తీశేశాడు కనక పెద్ద పేరుబడ్డ బ్రహ్మసమాజికుడాయెను (అసలు కాలేజీలో వుద్యోగంకూడా సమాజంవల్లనే అని అందరికీ తెలిసిన రహస్యమే నాయను). పైగా ఈ మీటింగుకు ప్రెసిడెంటుగూడా ఆయెను—అంతా నిశ్శబ్దంగా వింటున్నారంటే ఆశ్చర్యంలేదు.

అంతవాడిని పట్టుకుని ఈ రమణగాడు డబ్బాలాగా వుంది అంటే మొత్తంమీద కొంచెం జాలివేసింది. అప్పుడన్నాను "ఇప్పుడు డబ్బాలాగా వుందని అంటున్నావు గాని మొదట నేను వద్దురా అంటే విన్నావు? అసలు నీవు ఎందుకొచ్చావో తెలుసులే. చివాట్లు తిన్నా సిగ్గురాలేదు నీకు. మధురం వచ్చిందేమో చూతామని వచ్చావు. ఆమె రాలేదు, ఇహ పోదాం పద అంటున్నావు."

"మధురం కోసం వచ్చానంటే నేను వొప్పుకోనుగాని ఆమె రాక పోవటం కొంత వింతగానే వుంది" అన్నాడు రమణ.

ఇంతలో దిక్కులు చూస్తున్న ఓ పెద్దమనిషి మావంక చూచి "సైలెన్స్ ప్లీజ్" అని కేకేశాడు.

ఇక్కణ్ణించి ఇహ వెళ్లితేనే మర్యాద దక్కుతుందన్నా. ఇద్దరం బయటపడ్డానికి చూస్తుంటే ఇంతట్లోకే రామనాథంగారు రమణరావుని చూచి, గమ్మని సంజ్ఞచేసి కాగితాలేవో బల్లమీద పెట్టాట్ట, అవి అవసరంగా కావాలి అన్నాడు. రమణగాడు ఏమనుకున్నాడో సంకోచించకుండా బైలుదేరాడు.

రమణగాడూ అట్లా బయలుదేరి వెళ్ళి రామనాధంగారి ఇంట్లో మధు రాన్ని వొంటరిగా కలుసుకున్నాట్ట.

ఇహ ఇక్కడీనుంచీ మీకు డీటేల్సు సప్లయి చేయలేను. నాకు రమణగాడు చెప్పిందికొంత, చెప్పంది కొంత, నేను వూహించిందికొంత.

రమణగాడు బల్లమీద కాగితాలు తీసుకుంటుంటే మధురమే మొదలు పెట్టి వుంటుంది.

"విన్నావా?"

"ఏమిటి?"

"వచ్చే 10 వ తారీకు నాకు..."

"ఏమిటి?"

"మారేజి."

"ఏమిటీ—ఏమిటీ—మారేజా?—ఎవరికి?"

"నాకే."

"ఎవరు?"

"ఏమిటెవరు?—పెళ్ళికొడుకా?—ఎవరో బి. యస్. రావుట."

"ఆఁ!" నోరు కొంచెంసేపు అట్లాగే తెరుచుకొనివుంది రమణగాడికి.

"ఏమిటి ఆశ్చర్యం? నీ కిష్టం లేదా యేమిటి?"

"నీ కిష్టమేగా?"

"ఎందుకు? కాకపోతే ఈ పెళ్ళినుంచి నన్ను తప్పిస్తావా?"

"తప్పించమంటే తప్పిస్తాను."

"ఎట్లా?"

"ముందు నేనే పెళ్ళి చేసుకుంటాను."

"లేకపోతే?"

"నన్ను పెళ్లి చేసుకోక పోయినా తప్పిస్తాను. నీ ఇష్టం."

"నాకు ఎట్లాగైనా ఇష్టమే, నీ ఇష్టం ఎట్లాగో అట్లాగే చెయి."

అప్పుడు మధురాన్ని కనీసం రెండు మూడు ముద్దులయినా పెట్టుకొని వుంటాడు. అవకాశం దొరికితే వొదిలిపెట్టేరకంకాదు మన రమణగాడు.

అప్పటికి ఆపి కాగితాలు తీసుకొని పరుగెత్తుకెళ్ళి రామనాథంగారి కిచ్చి మళ్లీ పరుగెత్తుకొని వచ్చి మధురాన్ని కలుసుకున్నాట్ట. అప్పుడు ఏమిజరిగిందో నేను బొత్తిగా యేమీ చెప్పలేను.

రెండుగంటల రైలుకు బండి తీసుకొచ్చి రామం దగ్గర నిలబెడితే మధురం వచ్చి కలుసుకునేటట్టు ఏర్పాట్లు మటుకు చేసుకున్నారట. ఏర్పాట్లప్రకారం అంతా సక్రమంగా జరిగిందని నేను వేరే చెప్పక్కర్లేదు.

*　　　*　　　*

తెల్లవారింది. మమ్మునిద్దరిని రమ్మని ఖబురు పంపిస్తే నేను వెళ్ళాను రామనాథంగారింటికి. రామనాథంగారి ముఖంలో ప్రమాదకరమైన శాంతి కనిపిస్తూంది. రామనాథంగారి భార్య కంటిలో తడి కనిపిస్తూంది. ఎవరో రామనాథంగారి స్నేహితుడు గామాలును యింకో ఆయన వున్నాడు. వుండాలిసిన ఆదుర్దా అంతా ఆయన ముఖంలో వుంది. మొత్తంమీద లోపల ప్రవేశించినప్పటినుంచీ ఆ ఇంటిలో గాలి సులభంగా పీల్చుకోలేక పోయినాను.

"రమణరావు యేడీ?" అని అడిగాడు రామనాథంగారు.

"నిన్న సాయంత్రంనుంచీ నాకు కనిపించలేదు."

"ఎక్కడికి వెళ్ళాడు?"

"ఏమో, నాతో చెప్పి వెళ్లలేదు."

ఆ రెండో ఆయన అన్నాడు—"నిన్ను కాలేజిలోంచి డిస్మిస్ చేస్తారు, నిజం చెప్పక పోయినావంటే."

"ప్రమాణం చేసి చెపుతున్నాను. నిన్న సాయంత్రంనుంచీ కనిపించ లేదండి" అన్నా.

"రామనాథంగారూ! ఇహ యెందుకూ? ఇది ఆ రమణరావు పనే. అయితే అతను మీ ఇంటికి రావటం అలవాటు వుందా యేం?"

"ఎప్పుడన్నా వస్తూవుండేవాడే. ఇందుకోసం వస్తున్నాడని నాకేం తెలుసు? నిన్న సాయంత్రం కూడా కాయితాలు తీసుకురమ్మని ఇంటికి పంపాను. దాంతో వచ్చింది యీ ప్రమాదం."

"అసలు ప్రమాదం అదికాదు. నేనంటే మీకు కోపం వస్తుందేమో కాని, యెన్నేళ్ళొచ్చినా పెళ్లి చెయ్యకపోవటం, మొగపిల్లలతో బాటు చదివించటం. ఏమయినా చెప్పండి, చిన్నప్పుడే పెళ్లి చెయ్యటం మంచిది."

అప్పుడు రామనాథంగారి భార్య అందుకుంది--"అసలు తప్పు దాంది కాదు. తప్పంతా రామనాథంగారిదే. ఎవ్వరితో చెప్పకుండా ఓ ముసలి సంబంధం తీసుకొచ్చారు. దాంతో వాడలేసి పరుగెత్తింది."

"సరే, యిదికూడా ఒకటి చేశారూ? ఇక మీ బ్రహ్మ సమాజమేమిటి, మీ సంఘ సంస్కరణ యేమిటి?" అన్నాడు స్నేహితుడు.

రామనాథంగారికి మొహాన నెత్తురుచుక్కలేదు. చిన్నబుచ్చుకున్నాడు. అప్పుడు ఆ స్నేహితు డన్నాడు-" నే నొక సలహా చెపుతాను. అట్లా చెయ్యండి. మీ అమ్మాయికి యెన్నో యేడు?"

"పంధొమ్మిదో యేడు."

"అయితే కిడ్నాపింగుకింద పనికి రాదుగాని ఎబ్డక్షనుకింద ఆ రమణ రావు మీద కేసుపెట్టు!"

"మీ సలహా బాగాలేదు. లోకానికంతా యిట్లా జరిగిందని తెలియ బరచుకొని తలకాయి యెత్తుకోకుండా చేసుకోటానికి చెబుతున్నారు. ఇప్పుడే నేను బయలుదేరివెళ్ళి వాళ్ళిద్దరిని కొంపకు తీసుకొస్తాను. ఇక మీ రందరూ దయచెయ్యండి" అన్నాడు రామనాథంగారు.

అప్పుడు మేం అందరం వచ్చేశాం. నా మటుకు నేను రామనాథంగారి ప్రతిష్ఠ, మధురం ప్రతిష్ఠ ముఖ్యంగా రమణగాడి ప్రతిష్ఠ కాపాడటానికని యెవరికీ చెప్పదలచుకోలేదు. ఇంతలోనే వూరంతా యెట్లా తెలిసిందో నాకు బోధపడకుండా వుంది, అని వెంకట్రావు తనకథ ముగించాడు.



# నేనూ నా సీతా

నా జీవితంలో కల్లా అది బహు చెడ్డరోజు. ఇన్నాళ్ళయినప్పటికీ తలుచుకుంటే మొదటినుంచి చివరదాకా ప్రతిదీ జ్ఞాపకం వస్తూంది.

నన్ను బందరు బదలాయించినప్పటినించీ-అంటే యీ 7, 8 నెలల బట్టీ ఆ ఇంట్లోనే మేం అద్దెకున్నాం. మా ఇంటి కెదురుగుండా వాళ్లూ వున్నారు. రోజులు జరిగిపోతూ వుండేవి. ఒక్కసారిగూడా నాకు...

ఇంతకంటె మొదటినుంచీ మొదలుపెడితే బాగుంటుందేమో?

* * *

"నాన్నోయి! నాన్నా! అమ్మ-అమ్మ-"

"యేమిట్రా నీ గోల?" అన్నా.

"అమ్మ-మ్మ-" అన్నాడు మళ్ళీ సూరి.

"యేమిట్రా? అమ్మ బావిలో పడ్డదేంరా?" అన్నా.

లోపలనుంచి మా ఆవిడగొంతు వినపడ్డది. "చాల్లెండి-మీ మాటలు!-వూరికేను!—వాడు కాఫీ అయింది రమ్మని పిలుస్తుంటే విసుక్కుంటారు!"

"దాంట్లో యింత అర్థముందని నాకేం తెలుసు?—నీ అంత తెలివి నాకుంటేగా?—ఏమిటి, అట్లా తెరలోంచి మాట్లాడుతావెందుకూ? కాఫీ అయితే, యిక్కడకు తీసుకు రాకూడదూ?"

"ఆఁ, తెరలో తయితక్కలాడుతున్నా! చిన్నగుడ్డ కట్టుకున్నా, వీధిలోకి గూడా ఎక్కడవచ్చేది, సిగ్గుచేటు? అని లోపలికి రమ్మంటే వెయ్యి సవాళ్లు వేస్తారెందుకూ?"

అవును, అది గొప్పచిక్కే. మా ఇల్లు వీధిమీదవుంది. బయట వసారాలో ఒక చిన్నగదివుంటే అది నేను స్టడీరూం చేసుకున్నా. మా ఆవిడ మీద కోపంవస్తేగాని, మా సూరిని తప్పించుకుని తెరిపిగా వుందామంటేగాని ఆ గది దాక్కోటానికి ఎక్కువ ఉపయోగిస్తుంది. ఆ గదిలో పడుకుని సిగరెట్టు కాలుస్తున్నా, మా సూరి వచ్చి నా యేకాంతాన్ని భంగం చేసేటప్పటికి.

కాఫీ తాగటానికి లోపలికి వెళ్లా. ఒక చిన్న గ్లాసులో కాఫీ ఇచ్చింది

సీత. (అంటే మా ఆవిడ అసలు పేరు సీతారామమ్మ.)

"ఇంత కాఫా?" అన్నా హేళనగా.

"మీకు ఎక్కువయితే అట్టేపెట్టండి. తాగేవాళ్లున్నారు." అంది సీత ఇంకా హేళనగా.

ఆ కాఫీలోనే మా సూరికికూడా భాగం పెట్టా.

"ఇవ్వాళ మార్కెటుకు వెళ్ళాలె మీరు" అంది సీత.

"నువ్విచ్చిన కాఫీకి నేను ఇప్పుడు కదలకేం?" అన్నా.

"మరి యెట్లాగండీ?" అంది సీత.

"ఇవ్వాళిటికి వదలిపెట్టు, రేపు వెళ్ళకపోతే అప్పుడను, సీతా!" అని బతిమాలాను. అందాకా వచ్చిందికదా అని ఒక ముద్దు లంచంకూడా యివ్వబోయినాను.

"ఇప్పుడేమిటీ సరాగం వేళా పాళా లేకుండా!-బజారులో యెవరన్నా చూస్తారు." అంటూ దూరంగా పోయింది సీత.

నేను సిగరెట్టు వెలిగించాను.

"సీతా! సీతా! అని అందరిలోనూ అంటారు. అట్లా అనకండి, నాకు సిగ్గుగా వుంటుంది" అంది సీత.

నేను నా గదిలోకి ప్రయాణమయినా.

"మార్కెటుకు పోకపోతే పోయినారు, అబ్బాయిని కొంచెం పట్టుకోండి వంట అయ్యేదాకా" అంది సీత.

"దుంపతెగ్గొట్టావు! అయితే మార్కెట్టుకే వెళ్ళతాను."

"మరి యేదీ చెయ్యకపోతే యెట్లాగండీ?" అంది.

"యేదో ఒక శిక్ష తప్పదంటావు! సరె కానియి. రారా! సూరిగా!" అన్నా.

"సూరిగా? యేమిటండీ?-సూరిగా!-సూర్యం అనరాదూ? ముద్దుగా."

"సూర్యం! ఏమిటీ?--సూర్యం!—సూర్యనారాయణం అనరాదూ?" అన్నా.

"అబ్బా! ఏమి ఎగతాళి అండీ మీది. అంతానూ మరీనూ" అంది సీత.

*　　*　　*

గా ఆఫీసు టైము కావచ్చింది. సీత నాకు అన్నం వడ్డించి, రోజూ మోస్తరుగానే ఒక ముద్ద కలుపుకుని సూరినెత్తుకుని వీధివసారాలోకి పోయింది. అక్కడ కుక్కల్ని కాకుల్ని చూపిస్తూ వాడికి మెతుకు పెడుతుంది. నా కేమైనా కావలసివస్తే కొంచెం అరవాలె.

ఆ రోజు సగం అరవలేక, సగం ఆకలిలేక క్లుప్తంచేసి రెండునిముషాల్లో భోంచేశా. నా భోజనం అంత త్వరగా అయిందని మా ఆవిడకు తెలియదు. పిల్లవాడికి ఇంకా మెతుకు చూపిస్తూనేవుంది.

నేను చెయ్యి కడుక్కుని వసారాలోకి వెళ్లాను. నేను వచ్చింది సీత చూడలేదు. ఆమె మా ఇంటికెదురుగుండా వున్న కిటికీ వంక చూస్తోంది. నేనుగూడా అటే చూశాను. నాకు సరహరిరావు మొహం కనిపించింది. క్రాపింగు చెదరకుండా దువ్వుకున్నాడు. కళ్ళజోడు పెట్టుకున్నాడు. తప్పకుండా సీతవంక నే చూస్తున్నాడు. ఇంతలో నావంక చూశాడు. వెంటనే ఎటో బజారువంక చూస్తున్నట్టుగా నటించాడు.

నా గుండె బరువుగావుండి నెమ్మదిగా కొట్టుకోటం మొదలుపెట్టింది. ఇంతలోనే సీత నావంక చూసింది. ఆమె కళ్లల్లో ఆపుకొన్న ఆశ్చర్యం కొంచం కనిపించినట్టుగా నాకు తోచింది.

''అప్పుడే లేచారేం?''

నేను వినిపించుకోలేదు.

''భోంచెయ్యకుండానే లేచారా యేం?''

''భోజనం అయింది.''

''అప్పుడే? మరీ తమాషా అండి!''

''తమాషా భోజనం చేశానులే'' అన్నా.

సీత ఇంట్లోకివెళ్ళింది. నేను గదిలోకి వెళ్ళాను ఆఫీసు డ్రెస్సు వెయ్యడానికి. డ్రెస్ వేసుకుంటున్నంతసేపూ నా మనస్సు ఆలోచనలో మునిగిపోయింది,

ఆడవాళ్లంతా ఇంతేనా? ఛీ ఛీ! నాక్కూడా ఏమిటీ వెధవ అనుమానం? ఎప్పుడూ అనుమానమంటూ లేనివాణ్ణి నేను అనుమానపడ్డానంటే దీంట్లో

ఏదో వుందన్నమాటే-అయినా సీత అసలు-ఏమో?-ఎవరు చూశారు?

డ్రెస్ చేసుకోటం అయి ఆఫీసుకు బయలుదేరాను. పోతున్నానని కేక వేశాను; "తలుపు దగ్గరగా వేసి వెళ్ళండి" అంది సీత వంటింట్లోంచి.

నాకళ్లు ఆ కిటికీమీదికి పోయినయి. నరహరిరావు అక్కడే వున్నాడు. ఒక్కక్షణం ఒకరిని ఒకరం చూచుకున్నాం. బద్ధవిరోధుల్లాగా ఇద్దరం ముఖాలను తిప్పుకున్నాం. లోపలి వుద్దేశ్యాలను ఇద్దరం గ్రహించుకున్నట్టు కనపడ్డాం.

మేము ఆ ఇంట్లో ప్రవేశించినప్పటినుంచీ, అంటే ఈ 7,8 నెలలబట్టీ, వాళ్ళూ (నరహరిరావూ, వాళ్ళ అవ్వా) మేం ఇరుగు పొరుగ్గా, అంటే మాట్లాడినప్పుడల్లా పోట్లాడినట్లుగా కాకుండా వుంటూవుండేవాళ్ళం. వాళ్ళ అవ్వ సీతకు పెద్ద తోడుగా వుండేది. నరహరిరావు కాలేజీలో ఏదో చదువుతున్నాడు; వాళ్ళ అవ్వతో అక్కడ అద్దెకున్నాడు.

ఇంతవరకూ నాకు ఇట్లాంటి అనుమానంపోనే లేదు. పోయిన పైతేనా? అసలు ఇట్లాటి పెద్దమనిషి అని సందేహం కలగలేదు. అతని ప్రవర్తనే నీచంగా వుంది. సీతను నెమ్మది నెమ్మదిగా "టెంప్ట్" చేస్తున్న మాట స్పష్టం. ఇది నాకు తెలియకుండా ఎన్నాళ్ళనుంచీ చేస్తున్నాడో? నన్ను ఒక గడ్డి పాచకింద కట్టేశారు గామాల్ను ఇద్దరూ కలిసి!

వాళ్ళకు తెలిసివచ్చేటట్టు ఏదో వెంటనే చెయ్యాలి ననిపించింది. ఈ మాటు నరహరిరావు కనపడ్డప్పుడు జుట్టుపట్టుకుని ముక్కుమీద రెండు గుద్దులు గుద్ది, "నీసంగతి నాకు తెలిసింది, వళ్లు దగ్గిర పెట్టుకు బతుకు" అని అంటే—ఒకవేళ ఇదంతా నిజంకాకపోతే?-ఇదంతా నా భ్రమ ఐతే?—

లేకపోతే సంసారం వదలిపెట్టి ఏవుత్తర హిందూస్తానమో వెళ్ళిపోతే? అప్పుడు సీతకు ఇందుకు వెళ్ళాడుగదా అని పశ్చాత్తాపం వస్తుంది. ఐనా, నేను ఇంటికి రాకుండా, అక్కడే 10, 15 ఏళ్ళుండి, అక్కడ ఒక పెద్ద వుద్యోగం సంపాదించి, ఎట్లాగో రెండుమూడు లక్షలు సంపాదించి, మా వూరు చేరానంటే——ఎవరో గొప్పవాడు వచ్చాడని అందరూ చూట్టానికి వస్తారు. అప్పుడు నన్ను చూట్టానికి నూరితో సీతగూడా వస్తుందనుకో-

నన్ను చూచికొంచెం గుర్తుపట్టి తెల్లపోతుందనుకో. అప్పుడు నేనేమంటానుకి?

ఇంతకూ ఆవేళ హడావిడిలో తలగుడ్డ పెట్టుకోటం మరిచిపోయినా. ఆఫీసుకు సగందూరం వెళ్ళిందాకా కూడా తలగుడ్డ లేకుండా పోతున్నా ననే దృష్టి నాకు లేకపోయింది, ఈ వెధవ ఆలోచనలో.

మళ్ళీ ఆలోచించి చూస్తే తలగుడ్డ మరిచిపోవటంగూడా ఒకందుకు మంచిదిగానే తోచింది. ఇప్పుడు సీతగాని నరహరిరావుగాని నేను మళ్ళీ వస్తానని అనుకోరు. కనుక దొంగతనం ఏమైనావుంటే సులభంగా పట్టెయ్యవచ్చును.

ఈవూహ పుట్టినతరువాత పెద్దపెద్ద అంగలతో ఆదుర్దా హృదయంతో ఇంటికి మరలాను. ఇప్పుడుగూడా సీత ఆ పాడు కిటికీవంక చూస్తూ ఆ వరాండాలోనే నిల్చుని వుంటుందా?

మాసందుమలుపు తిరిగాను. మొదట ఎవరూ వరాండాలోవున్నట్టు కనిపించలేదు. ఇంతలోనే మా సూరిగాడి అరుపు వినపడ్డది. నేననుకున్నట్టే అంతా జరిగింది. నా హృదయంలో ఒకవిధమైన నిస్పృహ వచ్చింది. ఇంకా రెండడుగులు వేశేటప్పటికి సీత అక్కడే వరాండాలో వుంది. సూరికి ఇంకా మెతుకు చూపిస్తూనేవుంది. నేను ఇంటిముందరికి వెళ్లేదాకా నన్ను చూడలేదు. నన్ను చూడగానే ఆమెకంటిలో విశేషం ఏమీకనిపించలేదుగాని, ఒక్కసారి కనురెప్పలువంచి నేలవంక చూచింది.

అప్రయత్నంగా నేను వెనక్కితిరిగి ఎదురుగుండావున్న కిటికీలోకి చూచాను. నరహరిరావు అక్కడే వున్నాడు. చదువుతున్నాడో లేదో కాని పుస్తకం మొహానికి అడ్డంపెట్టుకున్నాడు.

సరాసరి ఇంట్లోకి వెళ్లాను. నావెనకనే సీతకూడా వచ్చింది.

"ఆఫీసుకు వెళ్తానని మళ్ళీ వచ్చారేం?" అంది.

నేను జవాబు చెప్పకుండా తలగుడ్డతీసి చుట్టుకుంటున్నా.

"తలగుడ్డ మరిచిపోయినారా ఏం? సరే, చెప్పకూడదూ?" అంది.

నేను మళ్లీ జవాబు చెప్పకుండా సీరియస్ ముఖంపెట్టి అద్దంలో చూచుకుంటున్నా. సీతకూడా నాపక్కనేచేరి అద్దంలోంచి నన్ను చూస్తూముద్దు

పెట్టుకుంది రెండు బుగ్గలూ. తన బుగ్గ ఇచ్చింది. కాని ముద్దు పెట్టుకో లేదు.

"మీరు మూతి ముడుచుకున్నారేం అట్లా! నేనేం చేశాను?" అంది జాలిగా. ఒక్క క్షణంకాలం నేను అనుమానంపడ్డసంగతి ఆమె గ్రహించిందా అనిపించింది. అప్పుడే ఏ సందేహానికి చోటు ఇవ్వగూడదని అనుకుని ఒకముద్దు ఆ బుగ్గమీద పెట్టాను. ఆమె రెండోబుగ్గకూడా నావైపు తిప్పింది. అప్పుపెట్టి వెంటనే వడ్డీ అడిగినట్టుగావుంది. రెండోబుగ్గకూడా సయించనివస్తువును బలవంతాన రుచిచూసినట్టుగా రుచిచూశాను. ఎంతోకాలంవృథాపోయినట్టుగా తలగుడ్డ సర్దుకోటం మొదలుపెట్టాను.

"ఏమిటండీ! అంత తొందరపడతారు? వెళ్లుదురుగానిలే" అంది సీత.

"సరలే, నీకేం?—చెపుతావు." అని ఆమెచేతిని వదల్చుకుని ఆఫీసుకు బయలుదేరాను.

* * *

ఆరోజు ఆఫీసులో కూర్చున్నానన్నమాటేగాని ఏమీ పని సాగలేదు. రోజూకంటె పెందలాడే, అంటే సాయంత్రం సుమారు 4 గంటలకే ఇంటిదారిన నడుస్తున్నా.

ఆఫీసులో వున్నంతసేపూ పనిచేయటానికి నామనస్సు స్వాధీనంలో లేకపోయినప్పటికీ నాయిష్టంవచ్చినట్లు నాలో నేను వుండటానికికూడా సావకాశం లేకపోయింది.

సీత యిప్పుడు ఏం చేస్తూవుంటుంది? అవ్వగారింటికి పెత్తనానికి వెళ్ళివుంటుందా?—ఆఁ. తప్పకుండా వెళ్ళివుంటుంది. అతను కాలేజీనుంచి వచ్చేదాకా అక్కడే కూర్చుంటుంది. ఇంతలో అతను వస్తాడు. ఒకళ్ళను ఒకళ్లు చూస్తారు-హెల్!—

అప్పుడు సీత లేడిలాగా లేస్తుంది.

అప్పుడు అవ్వగారంటుంది "ఎందుకమ్మా లేవటం? పనిలేక——వాడు నీకు తమ్ముడంటివాడు."

"అసలు యింటికి వెళ్లాలి అవ్వగారూ. సంధ్యపనీ అదీ చేసుకోవాలి" అంటుంది సీత.

"వెళుదు గాని లే-కూర్చోవమ్మా - ఏంపనులున్నాయి? ఆ అరసోలెడు గింజలూ వుడకెయ్యలేక పోతావూ?" అంటుంది అవ్వగారు.

అప్పుడు సీత నూరినిదింపి కూర్చుంటూ "మీకేం చెపుతారు-బుడ్లల్లోకి చమురుపొయ్యాలె - పనిచేసేదానికి అంట్లు వెయ్యాలె - పిల్లవాడికి గిం లెయ్యాలె-ఎక్కడపని అక్కడపెట్టి పెత్తనానికి వచ్చా నేనునూ" అంటుంది.

ఇంతలో, నూరి తప్పటడుగులు వేసుకుంటూ నరహరిరావు వున్న గదిలోకి పోతాడు. "రావోయి" అని నూరిని అతను దగ్గరకు తీసుకుంటాడు. వాపం వాడికేం తెలుస్తుంది! చప్పట్లుకొట్టుకొంటూ అతనితో ఆడుకుంటాడు.

అప్పుడు సీత అంటుంది "ఏమండోయి అవ్వగారూ! మావాడు గదిలోకి వెళ్ళినట్లున్నాడు. పుస్తకాలేమైనా చింపుతాడేమో?"

అంతలో అతను అందుకొని "లేదండీ, నేను ఇక్కడే వున్నాను. చక్కగా ఆడుకుంటున్నాడు నాతో." అని అంటాడు.

హెల్!——

ఆ అవ్వకేం తెలుస్తుంది? నూరికి వున్నంత జ్ఞానంకూడా వుండదు. బోడినెత్తిని గుడ్డ బాగాకప్పి కునికిపాట్లుపడుతూ కూర్చుంటుంది. అప్పుడు——

ఇట్లా ఆలోచిస్తూ నడుస్తుంటే ఇంతలో మాసందులో తేలాను.

మాయింటికిచేరితే నే ననుకున్నట్లే తలుపు తాళంవేసివుంది. అవ్వగారింటికే వెళ్ళిందిరా దేముడా అనుకున్నా.

ఆ కిటికీలోకి చూచాను. ఇంటో ఎవరూ వున్నట్లు కనిపించలేదు. సందుదాటి వాకిలిదగ్గరకువెళ్ళి చూచాను. వాళ్ళ ఇల్లుకూడా తాళంవేసే వుంది. బహుశా ఇద్దరూకలిసి ఎక్కడికో పెత్తనానికివెళ్ళారుఅనుకున్నా.

బయటగది తాళంచెవులు నా జేబులోనేవున్నాయి అని అప్పుడు జ్ఞాపకం వచ్చింది. తాళంతీసి గదిలోవేశించా. తలగుడ్డ కోటుతీసి వుత్తరీయంవేసి మళ్ళీ ఎక్కడికన్నాపోదామా వద్దా అని ఆలోచిస్తూండగానే ఇంతలో నరహరిరావు మాసందులోకి తిరగటం కనిపించింది. వెంటనే గదితలుపులూ కిటికీతలుపులూ వేశాను. నేను ఇంట్లో వున్నట్లు అతనికి తెలియటం నాకు ఇష్టంలేదు. సీత వచ్చినతర్వాత ఇద్దరినీ వాళ్ళకు తెలి

యకుండా గదిలో వుండి కనిపెడదామని అప్పటికప్పుడు ప్లానువేశాను.

అతను దగ్గిరకువచ్చాడు. రెండుయిళ్ళూ తాళం వేసివుండటం చూశాడు. తన జేబులోంచి ఒకతాళం చెవి తీసి యింట్లో ప్రవేశించాడు.

ఇంతలో అవ్వగారూ, సీతా వస్తున్నారు. అసలు సమయం వచ్చింది అని తగు జాగర్తలోవున్నా. అతనుగూడా కిటికీ దగ్గరకు వచ్చి వాళ్లు రావటంచూచాడు. చూచిగూడా కదలక అక్కడే నిల్చున్నాడు.

వాళ్లు దగ్గిరకువచ్చేక వాళ్ళమాటలుగూడా వినపడుతున్నయి.

"అమ్మాయీ! నే చెపితేవిన్నావూ? ఒకటే తొందర 'వారొచ్చారేమో? వారొచ్చారేమో?' మీ యింటాయన వచ్చిన జాడేలేదు."

"మీఅబ్బాయి వచ్చినట్టున్నాడండి అవ్వగారూ" అంది సీత.

"వాడే వస్తాడు—బడి వదిలి పెడితే రాకేం చేస్తాడు." అంది అవ్వగారు.

నరహరిరావు సీతను పెద్ద కళ్లుపెట్టుకు చూస్తున్నాడు. అందాన్ని గ్రోలటం అంటే అదే కామాలు.

సీతముఖాన్ని నేగూడ తేరిపార చూచాను. నాకు ఇదివరకు కనపడని అందం అప్పుడు కనపడ్డది. "నాఅందంచూడు" అన్నట్టుగా నడుస్తున్నది సీత; ఆనడకలోకూడా అందంవుంది. ఈ అందాలన్నీ నేను కనిపెట్టలేక పోవటంచేత నామీద వృధాఅయినట్లే. పాపం నరహరిరావు పెద్ద కళ్లుపెట్టుకు చూస్తున్నాడంటే అతని తప్పేంలేదు. ఏ మొగవాడైనా లొంగిపోతాడు.

ఇట్లాంటప్పుడు కట్టుకున్న మొగుడిధర్మం ఏమిటి? "అబ్బాయీ! నీవు చూచి ఆనందించగలిగిన ఆనందం నేను ఇన్నాళ్లనుంచిఅనుభవించిగూడా ఆనందించలేక పోయినాను; నీవే కనక అనుభవిస్తే నీ అంతరాత్మ ఎంత ఆనందిస్తోందో, ఎంత తృప్తిచెందుతుందో, కాబట్టి ఇదుగో యీ సీతను కొన్నాళ్లు ఆనందించు." అని అంటామా?-ఛీ!-ఏమీ, బాగాలేదు. చేతనైతే నేను ఆనందిస్తా. కాకపోతే మానేస్తా. అంతేకాని ఇంకోడికి యిచ్చి నేను వైదొలిగి వుండటం అనేది నిజమయిన పిచ్చి.

సీత కొంచెం సిగ్గు కనపరస్తూ నూరినిదించి, తాళంతీస్తోంది. ఇంతలో నూరి అలవాటుచొప్పున "నాన్నోయి—ఖాన్నా" అంటూ గదితలుపు

పెట్టాడు అకస్మాత్తుగా. నేను కొంచెం ఖంగారుపడ్డాను. నన్ను చూచి సీత బాగా ఖంగారుపడ్డది. కిటికీదగ్గిరవున్న నరహరిరావు తుపాకీతో కొట్టినట్టు మాయమై పోయినాడు.

* * *

ఆరోజురాత్రి తొమ్మిదింటిదాకా ఇంటికి పోలేదు. బొంబాయికాటన్ మైలు గేటుదాటి ఆరోడ్డునె పడిపోయినా—మళ్ళీ వెనక్కుతిరిగే వుద్దేశం లేనివాణ్ణిలాగా. బందరుకోటగూడా దాటిపోయినా. నిర్జనంగా వున్న ఒకచోట చీకట్లో గంటో గంటపైగానో కూర్చున్నా. అప్పుడు నా మెదడులో కలిగిన ఆందోళనఅంతా జ్ఞాపకమూ లేదు, జ్ఞాపకం వున్న కొంచెం కాగితంమీద పెట్టనూ లేను. ఒకదాని కొకటి సంబంధం లేదు.

చివరకు ఇంటికివెళ్తూ ఒకపద్ధతి అవలంబించటానికి నిశ్చయించుకున్నా. సీత కాపరానికివచ్చిన ఈ మూడేళ్ళనుంచీ, ఏదో రోజులు జరిగిపోతున్నయి అన్నమాటేకాని సీతమీద ప్రేమ-అదీ-వున్నట్టు ఎప్పుడూ నేను చూపించలేదు. వూరికె నే పెళ్ళాం అంటే నెత్తికెక్కి కూర్చుంటుంది; అందుట్లో ప్రేమా గీమా అంటే అసలు ఆనెత్తిమీంచి ఒకసారి గూడా దిగదు. అందుకని సీతను కొంచెం అదుపులోనే వుంచేవాణ్ణి. ఇప్పుడు పశ్చాత్తాపపడ్డా. ఇహ ఆరోజునుంచీ సీతకు ప్రేమను పెద్ద పెద్ద మోతాదుల్లో యిద్దామనుకున్నా. అది కొంతమటుకు అయినా పని చేస్తుందని నా ఊహ.

నేను ఇంటికివచ్చేప్పటికి తలుపు లేసివున్నయి. ఎన్ని కేకలేసినా జవాబు లేదు. నాకు కోపం హెచ్చుతోంది. ఆ కిటికీలోకిచూస్తే నరహరిరావు వాళ్ళగదిలోవున్న జాడాగూడా లేదు. కడుపులో పెద్ద అనుమానం గూడా పుడుతూంది. ప్రేమ మోతాదుల ప్రసక్తిమానేసి ఏమన్నా నుంచి మోతాదులే ఇవ్వాలిసిన అవసరం వుందనుకున్నా. ఎంతసేపో తలుపులు బాదినతర్వాత సీత "వస్తున్నా" అని కేక వేసింది. నిద్రలోంచి అప్పుడే లేచి వస్తున్నదానల్లే కళ్లు నలుపుకుంటూవచ్చి తలుపు తీసింది.

నేను ఏమీ తొందరపడలేదు! తొందరపడదల్చుకోనూ లేదు. ముందు గబగబా గదిలోకివెళ్లాను. ఎవరూ లేరు. అక్కడనించి పడమటిల్లూ వంటవసారా చూచాను, అక్కడా ఎవరూ లేరు. తలుపులు బందోబస్తుగానే

గడియాలు వేసి వున్నాయి. మళ్ళీ సావిట్లోకి వచ్చాను. నాలుగుమూలలూ చూశాను, ఎవరూ లేరు. అప్పుడు సావిడిమాట్టం అనవసరమని నాకు తెలుసు. ఎవరన్నా వున్నా తలుపు వెనకాలనక్కి నేను గదిలోకి పరుగెత్తినప్పుడు చప్పుడుకాకుండా బజారులోకి నడవవచ్చును. నేను ఇంట్లోకిరాగానే తలుపు ఘడియవేశామని దృష్టి లేకపోయింది. ఈ మాత్రం ఆలోచించలేదు. సీతగూడా తలుపులు భార్లగావుంచి ఒక పిచ్చివాణ్ణి చూచినట్టుగా నన్నుచూస్తూ నిల్చొంది.

"ఏమిటి వెతుకుతున్నారు?"

"ఏం లేదు." ఏదో కారణం బొంకటానికి నాకు తోచనూలేదు. నేను ప్రయత్నం చెయ్యనూలేదు.

"ఇంత ఆలస్యం చేశారేమిటి? నాకు ఒక్కదానికీ భయం వేసింది."

"అంతా అబద్ధం" అని ఎంతో అర్థం స్ఫురించేటట్టుగా అన్నానుకాని సీతమీద వృథా అయిపోయింది.

"మీకేం—అట్లాగే బడాయిగా చెపుతున్నానని అనుకుంటారు గామాలును—ఒక చెంప భయమేసి చస్తూంటే."

"నోరు మూసుకో—అధికప్రసంగం చెయ్యక."

"సరే—మీకు నన్నుచూస్తే కోపం రాందెప్పుడు? అది నా అదృష్టం. (అంతలోకే కళ్ళలోకి నీళ్లు తెప్పించుకుని, ఆపకుండా గొంతుక ఏడుపులోకిమార్చి) నేం చేసుకున్న పాపం!—ఖర్మంజాలక ఆలస్యమయింది అన్నా! నాకెందుకు? ఇహ నోరు నొక్కుకుంటాలెండి — లేకపోతే ఒక్కసారి పీక పిసికెయ్యండి—మీకు పీడ వొదిలిపోతుంది—హాయిగా వుండొచ్చు."

ఈ ధోరణిలోకి దిగింతర్వాత సీత మొహము భరించలేక పోయినా. ఆడవాళ్ళు ఏడిస్తే అదొక అందం మొహానికి తెచ్చిపెడుతుందని ఎవడో కవి పుట్టించాడుకాని అది సర్వఅబద్ధం. నాకు ఏడుపు మొహం చూస్తే అరికాలిమంట నెత్తికొస్తుంది. అంతట మాట్లాడకుండా గదిలోకి వెళ్ళి మంచంమీద పడుకున్నా.

సీత ఏదో సణుక్కుంటూనే వంటింట్లోకి వెళ్ళింది. కొంతసేపున్న

తర్వాత వంటింట్లోంచే "అన్నం వడ్డించా" అని కేక వేసింది. నేను జవాబు చెప్పలేదు. పడుకునే వున్నా. ఒక పదినిమిషాలు చూచి స్వయంగానే గదిలోకి వచ్చింది.

"రారేం ?"

"నాకు ఆకలిగా లేదు. అన్నం తినను ఇవ్వాళ."

"ఏం ?"

"నీ భోజనం కానియ్యి."

"నా తిండికేం లెండి?—నేనుచస్తే ఎవరికి పట్టింది! బతుకుతే ఎవరికి పట్టింది !"

చెంగు నేలమీద పర్చుకుని పడుకుని వినపడీ వినపడకుండా అర్థంలేని రాగం మొదలుపెట్టింది. నేను అది యేడవటం అని గ్రహించుకున్నా. కాని నేను మాట్లాడకుండా పడుకున్నా. ఇట్లా ఒక పదినిమిషాలు గడచినతర్వాత మళ్లీ ఛలించుతూన్న గొంతుకతో మొదలుపెట్టింది.

"నాకు ఆకలిగావుంది—రండి."

నేను జవాబు చెప్పలేదు.

"నేను పొరపాటున 'ఆలస్యంగా వచ్చారేం?' అన్నాను. దానికి యింత కోపం ఎందుకు? నే ఇహ ఎప్పుడూ యెంతసేపటికి వచ్చినా అడగనులేండి. బుద్ధొచ్చింది. రాండి అన్నానికి."

"అందుకు కాదు."

"మరెందుకూ ?"

"నీకు తెలియనట్లు."

"నాకేం తెలుస్తుంది మీరు చెప్పకపోతే."

"ఇప్పుడు తెలియకపోతే అవుసరం వచ్చినప్పుడు చెపుతాలే తొందర యెందుకూ ?"

"అన్నం తిన్నతర్వాత సాధిద్దురుగాని లేండి."

"నేను ఇవ్వాళ కాదుగదా మరెప్పుడూ తిన్ను ఈ యింట్లో అన్నం."

"నేనేం చేశానని మీకు అంతకోపం?"

"నీవు కారణం తెలియనట్లు నటిస్తూంటే నాకు వళ్లు మండిపోతూంది."

కొంచెంసేపు సీత మాట్లాడలేదు. నేను మాట్లాడలేదు.

"ఇందాక ఇల్లంతా వెతుకుతున్నావెందుకు?"

"నాకు పిచ్చి."

"అబ్బ! యేం మాటలండీ? నాకు తెలియక అడుగుతూంటే."

"ఇన్నిసార్లు అబద్ధమాడివదానివి ఇంకా ఎన్నిసార్లయినా ఆడుతావు-నా మొహంచూసి చెప్పు-నరహరిరావు నీవంక చూస్తున్నాడా లేదా?"

కొంచెంసేపు అర్థంలేని చూపుచూచి అన్నది, "చూస్తే చూచాడేమో నాకు తెలియదు. ఒకవేళ చూస్తే అది నా తప్పుకాదు. అతనిపాపాన అతనే పోతాడు."

"మరి నీవుగూడా చూస్తున్నావా లేదా? ఒక విధమయిన చనువు ఇస్తేగాని మొగవాడు యెప్పుడూ ఆడదానివంక అట్లా చూడలేడు. అబద్ధమంటావా?"

"మీరు చదువుకున్నారు కనుక మీకే అవన్నీ తెలుసు. నాకేం తెలుస్తుంది? నేనతనివంక యేంచూడలేదు. పరాయి మొగవాళ్ళని చూట్టానికి నాకేంపని? ఇది మీకు తోచిందా ఎవరన్నా చెప్పారా? చాల్లేండి."

"ఇట్లా పాఠాలు మొదలుపెడితేనే నాకు వళ్ళు మండుకొస్తుంది. ఇది నేను చాలా రోజులనుంచీ గమనిస్తున్నాను. ఇప్పుడు నీవు పూర్తూ, అంటే పోగు."

"మరి యిల్లంతా వెతికిన కారణం అతను ఇంటో వున్నాడనేనా? అంత అనుమానమా? అట్లాంటిపనులు మాఇంటా వంటాగూడాలేవు. ఈ నాటికి మీకు కొంగా అంటానికి తగింది."

ఆమాట నాతో మాట్లాడకుండా పెద్దదెబ్బ తగులుతే పడ్డట్టుగా ఒక మూలపడి యేడవటం మొదలుపెట్టింది. నాకు కొంచెం పశ్చాత్తాపం కలిగింది. ఒకవేళ తొందరపడి నిందించానేమోనని. ఐనా ఇప్పుడు ఏం చేసేదిలేదు. ఒక అరగంటసేపు యెవరం మాట్లాడలేదు.

"ఇహ నీవువెళ్ళి భోంచేయి" అని ఇదే చిట్టచివరి ఆజ్ఞ అన్నట్టుగా అన్నాను.

"చేస్తాలేండి" అన్నది, చెయ్యను అనే అర్థం స్పష్టంగా స్ఫురించేటట్లుగా.

"పూరికే, చూస్తున్నావు అన్నాగాని అంతకంటే నే నేమన్నానుళ?"

"ఏదో అన్నారులేండి. నన్నెందుకు మాటాడిస్తారుళ?"

"మరి నీవు చూచినమాట అబద్ధమాళ?"

"ఒకవేళ చూచాననే అనుకోండి——మరి మీరు బయటికి వెళ్లినప్పుడల్లా యెవరెవరిని ఎన్నెన్నిమాట్లు యెన్నెన్నివిధాలగా చూస్తున్నారో నేను కనిపెట్టానా, తగాదా పెట్టానాళ?"

అవును అది నిజమే. ఆటకాయితనంగా చాలామందికి కన్నుకొట్టాను. ఏమీ వుద్దేశ్యంలేకపోయినా అట్లాచెయ్యటం తాత్కాలికంగా ఒకవిధమైన సుఖము కలిగించేమాట వాస్తవం. ఇవన్నీ నిజమైన ప్రేమవుండికాదు. నిజమయిన ప్రేమకు అడ్డమూరావు. మగవాళ్ళకున్న అవకాశం ఆడవాళ్ళకుమటుకు ఎందుకు వుండకూడదుళ ఇంతలోనే సీత చెడిపొయ్యేదేముందిళ ఈ విధంగా ఆలోచించుతే నాకు ఒక విధమైన సంతోషంకూడా వచ్చింది. సీత ఆవిధంగా ఎంతమందిని చూచినా నాకు యేమీ అభ్యంతరం వుండకూడదని తోచింది.

"నేనుమటుకు తగాదా పెట్టానా ఏంళ 'నీవు చూస్తున్నావు' అంటే-'నేను చూట్టంలేదు' అని నీవు అంటే నాకోపం వచ్చింది కాని నీవు చూస్తున్నావని ఒప్పుకుంటే నాకోపం ఏముందిళ 'సరె చూస్తేమాన్లే' అంటూ నేను. ఇహా మనం భోంచేద్దాం ఆలస్యం చెయ్యక."



# రంగా, ఎం. ఏ.

వేమూరు స్టేషనులో రైలు ఆగింది.

చిన్న పెట్టెలో నేను ఒక్కడినే వుంటం చూసి నా పెట్టెలోకే వచ్చాడు ఒక పెద్దమనిషి. పెద్దమనిషల్లే కనిపించాడు. పెద్దమనిషే గామోల్ను అనుకున్నాను అప్పుడు.

నాకు సందేహించటానికి ఏమీ కనిపించలేదు. చక్కగా దుస్తులు వేసుకున్నాడు. గడ్డం మీసం చక్కగా పెంచాడు. కళ్లజోడు పెట్టుకున్నాడు. మోకాళ్ళవరకూ లాల్చీ తొడుక్కున్నాడు. అద్దకంవేసిన ఖద్దరు వుత్తరీయం వల్లెగా వేసుకున్నాడు. చేతిలో ఏదో పుస్తకంకూడా పట్టుకున్నాడు.

అతన్ని నా పెట్టెలో ఎక్కవొద్దంటానికి నాకేమీ హక్కులేదు. తెలియని ఆసామి ఐతే ఈపెట్టెలో ఎక్కకూడదు పోవయ్యా అనేవాడి నే. చదువుకున్న మొహంతో వస్తే ఎక్కకూడదని ఎట్లా అంటాను? ఐనా మరీ మోటమొద్దు కాదుకదా అని నాలో నేనే సంజాయిషీ చెప్పుకున్నాను. పెట్టెలో ఎక్కిన తర్వాత "కూచోండి" అని కూడా ఆహ్వానించాను.

"మీరెందాకా?"

"తెనాలి—మీరు?"

"తెనాలే."

"ఆగ్రంథం చూసిస్తాను, ఒకసారి ఇస్తారూ?" అన్నాను.

అడగ్గానే ఇచ్చాడు. అట్ట తెరవగానే రంగా, యం. ఏ., అని ఇంగ్లీషులో రాసివుంది. దాన్నిండా చిత్రపటాలు వున్నయి. అవన్నీ బెంగాలీ ఆర్టుకు సంబంధించినవి. బొమ్మలన్నీ తీరిగ్గా చూచాను.

"ఈబెంగాలీ ఆర్టును గురించి మీ అభిప్రాయం ఏమిటి?" అన్నాను.

"చాలాగొప్ప ఆర్టు-సందేహం ఏమిటి?"

"నామట్టుకు నేను వాటిల్లో గొప్పతనం ఏమీ గ్రహించలేకుండా వున్నా. అష్టవంకర్లగా చెట్లూ; క్షయరోగివలె కాళ్ళూచేతులూ, పీలగా ఒక ఆడబొమ్మా; వంకర్లు తిరిగిన వేళ్ళూ; కోడి నిద్రపోతున్నట్టుగా కళ్లూ-చూచినకొద్దీ భరించలేకుండా వున్నాను ఈ బెంగాలీ ఆర్టు."

"మొదట్లో కళలో ప్రవేశంలేని మనిషి చూస్తే అట్లాగే అనిపిస్తుంది.

కాని వాటిలో రసం గ్రహించటం మొదలు పెడితే గొప్పతనం తెలుస్తుంది.'' అన్నాడు తనకు మంచిప్రవేశం వున్నట్టు సూచిస్తూ.

''తమకేం వుద్యోగం?'' అన్నాను.

''నాకు వుద్యోగాలమీద ఆసక్తి లేదు.''

''పుస్తకంలో 'రంగా' అనివుంది తమపేరే అనుకుంటాను.''

''అవును.''

తమకు యం. ఏ. లో సబ్జక్టు ఏమిటీ?''

''ఏదో లిటరేచరు వెలిగించా లేండి. ఏమిటీ—ఎందుకూ కొరగావు ఈ చదువులు.''

''తమ రేంచేస్తూవుంటారు?''

''ఏదో కళోపాసన చేస్తూవుంటా లేండి.''

''తమరుగూడా సొంతంగా బొమ్మలు గీస్తూ వుంటారా?''

''కొద్ది కొద్దిగా—ఇప్పుడిప్పుడే.''

''మీరుగీసిన బొమ్మలేమయినా వున్నయ్యా ఇప్పుడు మీదగ్గర?''

''ఆర్టే గియ్యలేగు ఇంకా. నేను ఈ ఆర్టు రెండు మూడు నెలలనుంచే ప్రారంభించాను-అదివరకు ఎక్కువగా పొయిట్రీలో కృషిచేస్తూ వుండే వాణ్ణి.''

వీడెవడో పిడుగల్లేవున్నాడు-ఇంకా ప్రపంచకం ఇల్లాంటి గొప్పగొప్ప వాళ్ళను శీతకన్నుతో చూసే చెడ్డ అభ్యాసంలో వుంది-అనుకున్నా.

''తమపేరు నేనెక్కడా వినసందుకు నాకుచాలా చింతగావుంది'' అన్నా.

''అందరి మోస్తరుగా ఆర్టే సొంతడబ్బా వాయించుకొని బయటకు రావటం నాకు చేతగాదండి. దానికిగూడా కొంతసాహసం, నేర్పూ వుండాలి-ఏమంటారు?''

''తప్పకుండా'' అన్నాను.

* * *

ఇంతలో రైలు తెనాలి స్టేషనులో ఆగింది. ఇద్దరం రైలుదిగాం. దిగటంతోనే ఎవడో నాతోవస్తున్న కళోపాసకుని చాలా అగౌరవంగా పలుకరించాడు.

''ఏంరా! రంగాచార్లు!-మరిచి పోయినా-యక్ స్క్యూజు మి—రంగా, యం, ఏ, అనాలి గామాల్ను—దాని దుంపతెగ—ధాని మొహానన్నా

కట్టుకోరాదూ?—మాకు జ్ఞాపకమున్నా వుంటుంది—మొదటనుంచీ 'ముడుంబి రంగాచార్లు!' అని పిలవటం అలవాటాయెను-యక్స్క్యూజు మి-అయితే, ఏమిటి గిరాకీ, కొత్తవేషంతో బయలుదేరావు తెనాలికి—చిత్ర కళమీదగాని, పాయుట్రీమీదగాని లెక్చర్లు ఇవ్వమని ఎవరన్నా పిలిపించారా ఏమిటి-" ఒక్కబిగిన ఈవిధంగా అనాలిసినమాటలన్నీ అన్నాడు.

రంగా, యం.ఏ. చిన్నపుచ్చుకుని కోపంగా చూస్తూ "ఏమిటోయి!-పెద్దా పిన్నా ఉన్నారని లేకుండా, వేళాపాళా లేకుండా, ఎప్పుడూ యకచకాలేనా? మనిషి అయినవాడికి కొంచం బుద్ధివుండాలి." అన్నాడు. "పోరా!—రంగా యం. ఏ.-వెధవ ఫష్టుపారం గ్రాడ్యుఏటు!-పోరా!" రంగా యం. ఏ. వాణ్ణి కొట్టబోయినాడు. నేను విడదీసి ఇవతలకు తీసుకు వచ్చాను.

"చూడండి—వాడు ఎట్లా పేలిపోతున్నాడో! వాడికి మానర్సు చిల్లిగవ్వంతేనా తెలుసు నంటారూ?" అన్నాడు.

"ఎబ్బే ఎందుకంటానూ?" అన్నాను నాకు ఈ రంగా యం. ఏ. గాడితో తగాదా ఎందుకని. ఇద్దరం గైలు వంతెన దాటివచ్చాం. ఇక ఎవరి దారిన వాళ్ళం పోవచ్చునుకదా అని అనుకున్నాను.

"మీరు బండి చేసుకుంటారా?" అన్నాను.

"చేసుకుందాం" అన్నాడు.

"మీరు మాట్లాడుకోండి. మా ఇల్లుదగ్గిరే నేను నడిచి వెళ్లుతా" అన్నాను.

"మీరు నడుస్తే నేనూ నడుస్తా"అన్నాడు.

ఆరోజు మంచి అపశకునంలో బయలుదేరాను గామాల్ను. లేకపోతే ఈ రంగా యం. ఏ. ఎందుకు దాపరిస్తాడు—అనుకున్నా.

కొంత దూరం కలిసి నడిచాం. రంగా యం. ఏ. అధాట్టుగా ఆగి "చూచారా, అదృశ్యం!" అన్నాడు.

రోడ్డు పక్కగా ఒక చిన్న జాజికాయ పెట్టెమీద ఒక బక్క-చిక్కిన మనిషి కూర్చున్నాడు. చేతులు నామకః పేలికల్లాగా బుజాల మీద వేళ్లాడుతున్న చొక్కా ఒకటి తొడుక్కున్నాడు. ఇంకా మాసికలు వేసినటువంటివీన్నీ, వెయ్యనటువంటివీన్నీ, చిరుగులు చాలా వున్నాయి ఆ చొక్కాకు. ముందు ఇంకో జాజికాయ పెట్టెమీద సగం కుళ్ళిన

మామిడికాయలు 15, 16 చక్కగా—కుళ్ళిన భాగం సాధ్యమైనంత వరకూ కనపడకుండా—పేర్చబడి వున్నాయి. పక్కని నేలమీద ఇంకా మరీ జీర్ణించిన చీరెకట్టుకొని ఒక ఆడమనిషికూడా వుంది. బహుశా అతని భార్య గావచ్చును. భర్త కుండాలిసిన ఠీవితో అతను ఆ చిన్న జాజికాయ పెట్టెమీద కూర్చుని, ఆ చిన్న దుకాణాన్ని మానేజీ చేస్తూ వుంటే, భార్య కుండాలిసిన నమ్రతతో ఆమె నేలమీద కూర్చుని చంటి పిల్లలకు పాలిస్తున్నది. అప్పుడు భర్తవంకా, దారినిపొయ్యే వాళ్ళవంకా, దీనంగా ఈ పళ్ళు ఎవరన్నా కొంటారా అన్నట్టుగా చూస్తూకూర్చుంది. అతను "నీవు ఆడదానివి నీకేం తెలుసు అమ్మటం" అన్నట్టుగా భార్య వంకనూ, పళ్లు అమ్ముడుపోయినా పోకపోయినా తనకు లెఖ్క లేదన్నట్టుగా బజారు వంకనూ చూస్తున్నాడు.

"చూచారా ఆ దృశ్యం? మనం చిత్రించాలంటే ఇట్లాంటి దృశ్యాలూ నోటు చెయ్యాలి ముందు. కళ్ళుమూసుకుని వూరికే దారి వెంబడి పోతూవుండే వాడు ఎప్పుడూ మంచి చిత్రకారుడు కాలేడు. నేను సామాన్యంగా ఇట్లాంటి దృశ్యాలను మనస్సులో నాటించుకోకుండా పోను—చూశారా!" అన్నాడు రంగా యం. ఏ.

నేను ఈ పిచ్చివాడికి జవాబు చెప్పేదేమిటి అన్నట్టుగా నిల్చున్నాను.

రంగా యం. ఏ. నేనూ ఆ దుకాణం ముందగ ఆగిచూస్తూ వుంటే భార్యాభర్తలు ఇద్దరూ 'నిజంగా పళ్లు కొంటారా ఏమిటి!' అన్నట్టుగా సందేహంగా మావంక చూచారు.

రంగా యం. ఏ. సరాసరి పళ్ళ దుకాణం దగ్గరకు వెళ్లి పళ్లు బేరం ఆడాడు. పళ్ళు బాగుండలేదు రావయ్యా అంటే వినిపించుకోలేదు. వాడు పళ్లు డజను పావలా చెప్పాడు. రంగా యం. ఏ. పావు గంట బేరం ఆడి చివరకు అర్ధణా తగ్గించాడు. డబ్బిచ్చి డజను పళ్లూ కొన్నాడు. నేను నిర్ఘాంతపోయి చూచాను వాడు ఆ కుళ్ళిపోయిన పళ్ళు అంతపెట్టి కొంటూవుంటే. పళ్ళు వుత్తరీయంలో వేసుకొని నన్ను కలుసుకున్నాడు.

"ఎందుకండీ ఆ కుళ్లిపోయిన పళ్లు? అవి తింటే కలరా వస్తుంది." అన్నాను. నా మాట వినిపించుకోకుండా పెద్ద ఘనకార్యంచేసిన వాడిలాగా పొంగిపోవటం మొదలు పెట్టాడు.

మళ్ళీ గట్టిగా "అట్లా కుళ్ళిన వాటికి అంత ధరకూడా పెట్టా రెందుకు?" అన్నాను. "నేనేం తెలివి తక్కువవాణ్ణి అనుకున్నా రేమిటి—అవి అంత ధరపెట్టి కొందామనే కొన్నాను.—ఆ దంపతులకు ఏదన్నా సహాయం చెయ్యాలని అట్లా చేశాను."

"సహాయం చెయ్యాలని వుంటే వూరికే దానం చెయ్యకూడదనూ తోచిందేవోఁ?" "వాళ్ల సంగతి మీరు బాగా గ్రహించలేదు—వూరికే దానం చేస్తామంటే, వాళ్ళు సామాన్య బిచ్చగాళ్ళలాగా పుచ్చుకోరు. ఏదో కష్టపడి సంపాదించినట్లు వుండాలె."

రంగా యం. ఏ. కు మొదడు బొత్తిగా పని చెయ్యడం మానలేదు గాని అష్ట వంకరలుగా పనిచేస్తున్నట్లు స్పష్టమయింది. "అంత సహాయం చెయ్యాలని వుంటే పావుగంట బేరం ఆడటం ఎందుకు?" అన్నాను.

"అట్లా బేరంచేసి కొనకపోతే వాళ్లకు అమ్మినట్లు సంపాదించినట్లు సంతోషం వుండదు." జవాబు మటుకు చాలా తెలివితేటలుగా వుంది.

ఇంతలో ఒక మలుపు తిరిగాం. అక్కడ సైడుకాలువ వంతెనవుంటే ఆకాయలన్నీ ఎవరికీ కనపడకుండా ఆ వంతెనలో వదిలేశాడు. ఇక రంగా ఎం. ఏ. ఏం చేసినా నేను ఆశ్చర్యపడనక్కరలేదు. ఏమిటిది అని అడుగుతే కారణం చెప్పగల సామర్థ్యం గూడా వుంది అని వూరుకున్నాను.

అతనే "చూచారా! కుళ్ళిన పళ్లు ఏంచెయ్యటానికి కొన్నానోఁ?" అన్నాడు.

"ఇంతదూరం మోసి పారెయ్యట మెందుకూ?—అక్కడే పారెయ్యక పోయినారూఁ?" అన్నాను.

"వాళ్లు చూస్తూవుండగా కొని అట్లా పారేస్తే వాళ్ళేమనుకుంటారు—మనం దానా ధర్మం చెయ్యటానికి కొన్నామని వాళ్ళు గ్రహించుకుని, మనస్సులో చాలా నొచ్చుకుంటారు. అందుకని నాకు అట్లా చెయ్యటం ఇష్టం లేకపోయింది—ఎప్పుడో వాళ్ళిద్దరినీ ఒక చిత్రపటంలో గీచేస్తాను—నాకు ఒక మంచి సబ్జక్టు సప్లయి చేసినందుకు వాళ్ళను థాంకు చెయ్యాలి." అన్నాడు.

అందాకా వచ్చిన తర్వాత రంగా యం. ఏ. తో కలిసిపోవటం అపాయకరమని గుడ్ బై కొట్టి వేరుదారి తొక్కాను.

# వాసు పాటకచ్చేరి

ఒక పల్లెటూరు పెద్దమనిషి హైకోర్టులో ఆ నడవల్లోకూడా అటూ ఇటూ పొయ్యే వాళ్ళ మొహాలు తేరిపార చూస్తూ నడుస్తున్నాడు.

టిప్ టాప్‌గా వేషం వేసుకొని కొత్తవాళ్ళకు హైకోర్టు తమ సొంతం అనే భావం కలగచేస్తూ ముగ్గురు ఎప్రెంటీస్లు మాట్లాడు తున్నారు, ఒక మూడలి ప్రదేశంలో. వాళ్ళలో ఒకడు ఆపల్లెటూరు పెద్ద మనిషిని గుర్తుపట్టి పలకరించాడు,

"ఏమండోయి! నరసింహంగారూ! ఎప్పుడు వచ్చారు? అందరూ కులాసాగా వున్నారా?"

"ఎవరూ?—ఓహో! గోపాలా నీవా! నిన్ను గుర్తించ లేకపోయినా నోయి. అన్నట్టు నీవు ఇక్కడ ప్లీడరీ పని నేర్చుకుంటున్నావు కామూ?— నే నెప్పుడు వచ్చానా? పొద్దునే వచ్చా—అయితే నీతో ఒక మాట మాట్లాడాలె ఇట్లా వస్తావూ?" అన్నాడు పెద్ద మనిషి.

పలకరించి తద్దినం కొనుక్కు తెచ్చుకున్నాడు కనక గోపాలం నర సింహంగారు చెప్పే రహస్యం వినక తప్పిందికాదు. తక్కిన వాళ్ళిద్దరు మాట్లాడకుండా వీళ్ళిద్దరి వంకా, ఏక్షణాన కలయపడి కొట్టుకుంటారో అన్నట్లుగా, ఆదుర్దాగా చూస్తున్నారు.

అపాయం లేకుండానే గోపాలం రహస్యం పూర్తిచేసుకొని మిగిలిన ఇద్దరినీ కలుసుకున్నాడు.

"ఎవర్రా, ఆ పల్లెటూరు గొడ్డు?" అన్నాడు ఒకడు.

"ఏమంటాడ్రా వాడు?" అన్నాడు ఇంకోడు.

గోపాలం మొదలు పెట్టాడు "పాపం!—ఆయంది మావూరే—".

"మీవూరయితే పాపం ఎందుకూ?" అన్నాడు ఒకడు.

"నీ మొహాని!—నన్ను చివరదాకా చెప్ప నివ్వవేంరా, సత్యం?"

"అంటే నీ తెలుగు అఘోరించినట్లుగా వుందని నాభావం" అన్నాడు సత్యం.

"ఏడిశావు లేవోయి—వాణ్ణి చెప్పనివ్వక—" అన్నాడు మూడో వాడు.

"పాపం!—ఆయన కూతురికి—"

"మళ్ళీ పాపమా?"

"నాకు కోపం వస్తూంది—గాడిదలాగా—పాపం—ఆయన కూతురికి మొన్నీ మధ్యనే పెళ్ళిచేశాడు. అల్లుడు లేచిపోయినాట్ట, వెతకటానికి వచ్చాడు" అని తేల్చాడు గోపాలం.

"పాపం! పాపం!" అన్నాడు సత్యం, గోపాలంకు కోపంవచ్చేందుకు.

"ఎవడా అల్లుడు?" అని అడిగాడు మూడో ఎప్రెంటిసు.

"నేను గూడా అంతగా ఎరగను. ఈ శారదా బిల్లు హడావిడిలో టూకీ పెళ్ళిచేశారు. బి. యే. ప్యాసు అయినాట్టగాని ఇంకా వుద్యోగం కాలేదుట. పెళ్ళప్పుడు రేపోమాపో వుద్యోగం అవుతుందనుకున్నారు. అతనిది రాజమహేంద్రం దగ్గర ఏదోవూరట—పేరు శ్రీనివాసమూర్తి" అని తనకు తెలిసినంతమటుకూ చెప్పాడు గోపాలం.

"శ్రీనివాసమూర్తి?—ఎక్కడో పేరు విన్నట్టుగా వుందిరా!-మనిషి ఎట్లా వుంటాడురా?" అన్నాడు సత్యం.

"కొంచెం పొడుగ్గా—పచ్చగా వుంటాడు. చాలా పొడుగాటి ముక్కు—" అన్నాడు గోపాలం.

"చూట్టానికి ఎంత పెద్ద మనిషో అన్నట్టుగా వుంటాడు కదూ?"

"ఎంత పెద్దమనిషో అన్నట్టుగా వుండటం ఏమిటి నీ మొహం-వాడు పెద్ద మనిషే" అన్నాడు గోపాలం.

"సరే లే!—వీడుట్రా నీ శ్రీనివాసమూర్తి? శ్రీనివాసమూర్తి!—దుంప తెంపావే—తన పేరు శ్రీనివాసమూర్తి అని చెప్పుకున్నాడూ?—ఆరి వీడి తస్స చెక్క—పెద్ద దగా చేశాడే!—పాపం! మీకేం తెలుసు వాడు చెప్పిందంతా నమ్మారు గామాల్ను."

"ఏం, వాడి పేరు శ్రీనివాసమూర్తి కాదా యేం? నీకు తెలుసునల్లే వుందే" అన్నాడు గోపాలం.

"ఆ—నాకు తెలుసు. వాడి పేరు వాసు. అంతకంటె మూడో అక్షరం

లేదు. శ్రీనివాసమూర్తి—పెద్ద పేచీవేశాడు—వాడు వేసిన పేచీల్లో ఇదొకటి లెక్కకాదనుకో—అయినా పేచే. పేరువినగానే నరశింహం గారు పిల్లనిచ్చారు గామాల్ను."

"వాడిసంగతేమిటో చెపుమా కొంచెం—మమ్ముని చంపక" అన్నాడు మూడో ఎప్రెంటిసు.

"సంగతేమిటి-సంగతి? వాడు చెప్పకుండా లేచిపోయినాడంటే నాకేం ఆశ్చర్యంగాలేదు, వాడికి పిల్లనిచ్చిన వాడిది బుద్ధి తక్కువ. ఎట్లాంటి వెధవపని అయినా చెయ్యటానికి సామర్థ్యం వుంది వాడిదగ్గిర" అన్నాడు సత్యం.

"ఎవడ్రావాడు మాకూడా చెప్పు" అన్నాడు గోపాలం.

"ఏమిటిచెప్పు? వాడికి పెళ్ళి కావటమేమిటి? శారదాబిల్లు ధర్మమా అని అడ్డమయిన వాడికీ పెళ్ళే?" అన్నాడు దానికంతా గోపాలమే బాధ్యుడు అయినట్టుగా.

"శ్రీనివాసమూర్తి కంటే ముంగు నీకు మతిపోయి నట్టుంది. చెప్పరా అంటే చెప్పక చంపుతున్నావేమిటి?" అన్నాడు గోపాలం.

"ఒక పెద్దగాథలో దిగటం ఎందుకని చూస్తున్నా" అంటూ మొదలు పెట్టాడు సత్యం.

* * *

నేను కొత్తగా చెన్నపట్నంవచ్చి కాలేజీలో చేరా. బి. యే. లో ఈ వాసుగాడు ఎట్లా నన్ను తగులుకున్నాడో తెలియదు. నాగదిలో తిష్ట వేశాడు.

చెప్పటం వుద్యోగంకోసరమని చెప్పేవాడు. అప్పటికి రెండేళ్ళనుట్టీ చెన్నపట్నంలో ఆంధ్రవిద్యార్థు లెందరున్నారో వాళ్ళగదులన్నీ ఒక రౌండు అయిపోయింది. ఉద్యోగం లేదు సద్యోగం లేదు. వాడిసంగతి తెలిసినవాడు ఎవడూ గదికి చేరనిచ్చేవాడు కాడు. అయితే, ఏమాట కామాటే చెప్పాలె. నన్ను ఎప్పుడూ ఒకదమ్మిడీ అడగలేదు. పొద్దున్నే స్నానంచేసి వెళ్ళేవాడు, మళ్ళీ రాత్రి 8,9 గంటలకు గదికి చేరుకునే వాడు. ఎక్కడ భోంచేసేవాడో, ఏం చేసేవాడో తెలియదు. జేబులో ఒక దమ్మిడీ వున్నట్టు కనపడేదికాదు. ఒకొక్కప్పుడు పస్తుపడుకుం

టూ వుండేవాడే మోననికూడా నాకు అనుమానం. ఎప్పుడన్నా శని ఆది వారాల్లో పిలుస్తే హోటలుకన్నా, కాఫీహోటలుకన్నా, గెస్టుగా వస్తూవుండేవాడు.

ఎవడన్నా వుద్యోగం ఏమన్నా అయిందాఅని ఎప్పుడన్నా అడుగుతే, తనచక్రంవేసి (వాడికి జ్యోతిషంలోకూడా ప్రవేశం వుంది) వేళ్లులెక్క పెట్టి ఇంకా నెలరోజులలో తప్పక అవుతుందనేవాడు. అట్లా చెప్పక పోతే మనం బొత్తిగా అధైర్యపడి పోతామని.

ఒకొక్కప్పుడు చక్రంవేసి లెఖ్ఖకట్టి పెళ్ళే ముందు అవుతుందని చెప్పేవాడు. పెళ్ళి అయితే నేగాని వుద్యోగం కాదనేవాడు. అందుకని పెళ్లాంకోసం ప్రయత్నంచేసి తర్వాత వుద్యోగంకోసం ప్రయత్నం చెయ్యాలి అనేవాడు. నాకు మొదట తెలియదుకాని తర్వాత వీడికి పెళ్ళి పిచ్చి మహావుందని తెలిసింది. పెళ్ళాం వచ్చిందంటే ఉద్యోగం దానంతట అదే అవుతుందని వాడినమ్మకం. అందుకని పెళ్లాంకోసం ప్రయత్నం చేస్తున్నా, వుద్యోగంకోసం ప్రయత్నం చేస్తున్నానని అందరితో చెప్పేవాడు.

ఒకొక్కప్పుడు జాతకం చూసిచూసి, పెళ్లీ వుద్యోగం రెండూ ఒకసారి అవుతయి ఏమోనని తనకు కొంచెం సందేహం కూడా వున్నట్టు అర్థసాయిలో మాటాడేవాడు. కాని నిర్ధారణచేసి చెప్పలేననేవాడు. పోనియి ఎవడికన్నా మంచి జ్యోతిష్కుడికి చూపించి సందేహం నివృత్తిచేసుకోకూడదా అనేవాణ్ణి. తనకంటే వాళ్లకేం తెలుసునని ఒక అహంభావం.

ఈ వాసుగాణ్ణి వదలకొట్టుకోటం ఎట్లా అనేది ఒక పెద్ద సమస్య అయింది. వెళ్లరాఅంటే ఎక్కడికివెళ్తాడు? వెళ్ళేచోటుకూడా మనమే చూపించాలి. వాడిసంగతి ప్రతివాడికీ తెలుసు. ఎవడూమోసపోడు. మళ్లీ కాలేజీలు తెరిచేరోజులువస్తే కొత్తగా జేరేవాళ్లు వస్తే వాళ్లల్లో ఎవడినన్నా మోసగించి అంటకట్టాలి. అంటే ఒక సంవత్సరంపాటు వాణ్ణి భరించాలి అన్నమాట–మూడువందల అరవయి నాలుగు రోజులు!

* * *

రోజూ రాత్రి 9 గంటలకు వచ్చేవాడు. ఆరోజు 7 గంటలకే వచ్చాడు.

నేను అప్పుడే హోటలునుంచి వచ్చాను. బద్ధకంగావుండి లాంతరుకూడా వెలిగించకుండా వెన్నెట్లో కూర్చున్నా.

వాసు కోటూ చొక్కా విప్పి, లాంతరు వెలిగించి, ఒక చాపతోనూ యేదో పుస్తకంతోనూ తయారు ఐనాడు బయటికి. రోజూకంటే పెందలాడే రావటం, పుస్తకాలు ముట్టుకోటం ఎప్పుడో వదిలిపెట్టినవాడు, ఒక పుస్తకంతో తయారు కావటం—చూస్తే నాకు చెడ్డ ఆశ్చర్యం వేసింది. మాట్లాడకుండా తమాషా చూస్తూ కూర్చున్నా.

పుస్తకం తెరిచి పేజీలు ఆ చివరనుంచి యీ చివరకు ఒకసారి తిప్పి, ఎక్కడో కనపడ్డచోట చదవటం మొదలుపెట్టాడు.

"సారినీధా—నీసారి, గసారీ-సరిగగరీ-గగరిగమపధ-మపగరిస.

"అఅఆఆ—విరిబోఓ ఓఓ—ఒఒఒఒణీ--నిఇఇఇఇఇఇఇఇ-ఇఇఇఇ-న్నె ఎఎఎఎ కొ ఒఒఒ-ఒఒఒఒఒఒ-రిఇఇఇఇఇఇఇ-మఅఅ రుఉఉఉఉ-లుఉఉఉ—కొ ఒఒఒఒఒఒఒ న్న అదిఇఇఇఇఇఇఇఇ—ఇఇఇరఅఅఅఅ-అఅఅఅఅ—అఅఅఅఅ ఒఅ—అఅఅఅ!"

ఇది వింటూ నేను మొద్దుబారిపోయినా. ఇన్నాళ్లనుంచీ ఆపాలిమేర్ల తిరుగుతూ ఇప్పుడు అచ్చగా పిచ్చిలో పడ్డా డనుకున్నా. ఇహ విచ్చల విడిగా పోనిస్తే బాగుండదని "ఏమిటది?" అని గదమాయించి అడిగాను.

"భైరవిరాగము—ఆటతాళము" అన్నాడు.

"అదికాదురా నే నడిగింది—"

"పుస్తకమా?—గానవిద్యాతరంగిణి—వెల ఒక రూపాయి."

"ఛట్! ఫూల్!—ఏమిటది అంటే నీకు మతిపోయిందా వున్నదా అని సందేహంగా వుండి అన్నా."

"ఎందుకు అట్లా అడుగుతున్నావు?"

"నీవు ఎందుకు అట్లా సంగీత పుస్తకం ఒకటి తీసుకొచ్చి కుక్క మొరిగినట్టుగా నోటితో శబ్దాలను పుట్టిస్తున్నావు?"

"నాకు ఒక అవసరం వుండి అట్లా చేస్తున్నాను— నేను నాలుగు రోజులలో సంగీతం నేర్చుకోవలె."

వీడికి నిజంగా పిచ్చేనని ఆలోచనలో వుండి మాట సామెతగా 'ఏం' అన్నా.

"నేను ఆదివారం నాడు మైలాపూరులో సంగీతపాటకచ్చేరి చెయ్యాలి"

ఒక ప్రమాదకరమయిన పిచ్చివాడికి బారెడు దూరంలో వున్నానని అప్పుడు తెలుసుకున్నా. వీణ్ణి మాట్లాడించరాదు; మాటాడిస్తే పిచ్చిరేగిందంటే అది అర్ధరాత్రి. సహాయం వచ్చేవాడుకూడా ఎవడూ లేడు అని అనుకొని మాట్లాడకుండా గదిలోకిపోయి పడుకున్నా. వాడు అట్లాగే అర్ధరాత్రిదాకా కుక్కలు మొరిగినట్లు, పిల్లులు మూలిగినట్లు, గాడిదలు కూసినట్లు చప్పుళ్ళు చేసి ఎప్పుడు నిద్రపోయినాడో నాకు తెలియదు.

*　　　*　　　*

మొన్నాడు సెమ్మదిమీద వాసుదగ్గరనుంచి ఇంతహటాత్తుగా యీ సంగీత పాటకచ్చేరీ చెయ్యాలనీన గ్రహచారం ఎందుకుపట్టిందో సమాచారమంతా లాగాను.

ఖర్మంచాలక ఎవడో పరిచయస్తుడు కొద్దిరోజులకిందట ఒక 'ఆంధ్ర పత్రిక' కొని మాగదిలో మరిచిపోయి వెళ్లాడు. అది వాసుగాడిచేతిలో పడ్డది. అందులో ఒక ఎడ్వర్ టైజుమెంటు వుంది.

కా వ లె ను.

సమర్ధుడయిన సంగీత మాష్టరు కావలెను. నెలకు రు 50-0-0 లు జీతం ఇవ్వబడును.

అప్లయి ఇన్ పర్సన్ టు:—

డి. రామారావు పంతులుగారు.

అడ్వొకేటు,

10 సింగప్పవీధి, మైలాపూరు,

మద్రాసు.

వాసుగాడు కనీసం ఈ వుద్యోగానికయినా ఎందుకు ప్రయత్నం చేయకూడదని అనుకున్నాడు. ఈ ఎడ్రెసు దగ్గిర పెట్టుకొని తెలివి తక్కువగా సరాసరి రామారావుగారింటికిపోలేదు. ముందుసంగతిసందర్భాలుఇతరత్ర

ఆ వీధిలోకి వెళ్ళి విచారించాడు. సంగీతం నేర్పాలిసింది రామారావు గారి కుమార్తె కమలకు. ఆమెకు 17, 18 సంవత్సరములు వుంటయి; భర్త రెండు మూడేళ్ళ కిందట పోయినాడు; వితంతువు—అంటే ఇంకా మళ్లీ పెళ్లి కాలేదన్నమాట. ఈఅట్టహాసమంతా మళ్ళీ పెళ్ళి చెయ్యటానికి గావచ్చును. రామారావుగారికి ఒక్కతే కుమార్తె కనక విధవ అయినా చదువు సంధ్యలు చెప్పించి గారాబంగా పెంచుతున్నారు.

ఇదంతా చూస్తే వాసుకి పెద్ద అదృష్టం పట్టినట్టుంది. ఈ ఉద్యోగంలో ఇరికాడంటే కమలను పెళ్ళిచేసుకునే ఛాన్సు కూడా కనుపడ్డది. జాతకంలో తను అనుమాన పడ్డదంతా అక్షరాలా జరుగుతున్నదని అప్పుడనుకున్నాడు.

ఈ వుద్యోగం సంపాదించాలంటే మామూలు వేషంలోపోతే లాభం లేదనుకున్నాడు. ఒక గ్రామఫోను కంపెనీకి వెళ్ళాడు. అక్కడ గొప్ప గొప్ప సంగీత పాటకుల ఫొటోలు గోడలకు వేళ్ళాడకట్టి వుంటయి. అవన్నీ బాగా పరిశీలించి చూచాడు. సుబ్బయ్య భాగవతారుగారిఫొటో వాసుకి బాగానచ్చింది. పేరు బాగావుండటమే కాకుండా మొహంకూడా దాదాపు తన మొహంలాగానే వుంది. దాన్ని బాగా స్టడీచేసి ఇంటికి వచ్చి దాంటోవున్నట్టు గానే మెడకాయదగ్గరనుంచి డజను గుండీలువుంటే ఒక నల్లకోటు తొడిగాడు. ఒక జరీ వుత్తరీయం మడత చెరగకుండా చేతికిందగా తీసి బుజంమీద వేశాడు. దాదాపు అట్లాగే ఒక పెద్ద తల పాగా చుట్టాడు. అచ్చంగా సుబ్బయ్య భాగవతారులాగానే తయారు అయినాడు. ఈ వేషంతో రామారావు గారింటికి వెళ్ళాడు.

రామారావుగారి సంగతి మీకు తెలుసుగా—ఆయన మంచి ప్రాక్టీసు వున్న ఎడ్వొకేటు ఆయను—ఎప్పుడూ తీరిక వుండదు. దర్శనం దొరకటం దుర్లభం. వాసు ఒక చీటీవ్రాసి జవానుచేత లోపలికి పంపాడు. రామారావుగారు సుబ్బయ్య భాగవతారుగారిని చూడలేదుగాని పేరువిన్నాడు. ఆయన ప్లేట్లుగూడా చాలా కొన్నాడు. సుబ్బయ్య భాగవతారు తన కోసం వచ్చారని వినగానే తక్కిన పనులన్నీ కట్టిపెట్టి వారిని లోపలికి రమ్మని ఖబురు చేశాడు.

"సుబ్బయ్య భాగవతారుగారు మీరేనా? కూర్చోండి ఆకుర్చీలో —

తమరు ఏదో పనిమీద వచ్చినట్లున్నారు ?''

ఆగదిలో రామారావుగారు కాక ఇంకో ఆయన ఎవరో గూడా వున్నాడు. రామారావుగారు "సుబ్బయ్య భాగవతారుగారూ'' అని వాసుని సంబోధించగానే వాసువంక ఆశ్చర్యంగా చూచాడు. వాసు ఒక కుర్చీలో కూర్చున్నాడు.

"ఆంధ్రపత్రికలో మీ ఎడ్వరుటైజుమెంటు చూచి మీ దర్శనం చేసుకుందామని వచ్చాను'' అన్నాడు వాసు.

రామారావుగారు ఆశ్చర్యపడ్డాడు. "మీరు మా అమ్మాయికి సంగీతం నేర్పడానికి రావటం నా అదృష్టమే కాని—అంత కొద్దిజీతం—''

"అందుకు మీరు సంకోచించ అక్కర్లేదు—రోజులు ఎట్లా వున్నయి? ఎంత కటువుగా అన్నా వున్నయి'' అన్నాడు వాసు.

"నేను మీకు ఒక సహాయం చేయగలను. పాటకచ్చేరీ ఒకటి అరగ్గైజు చేసి నా స్నేహితులందరికీ టిక్కెట్లు అంటగట్టి ఏదో సూక్ష్మంగా ముట్టచెప్పగలను'' అన్నారు రామారావుగారు.

"మీ అనుగ్రహంవుంటే అదే పదివేలు-ప్రస్తుతం పాటకచ్చేరికి మీకు అనవసరమైన శ్రమ కలగచేయటం నా కిష్టంలేదు—మీ అమ్మాయికి సంగీతం నేర్పాలని నాకు సరదాగావుంది—ఏమంటారు?''

"అంతకన్న నా?-మీకంటె సమర్థుడైన మాష్టరును తీసుకురాగలనా? —నాకు శ్రమ అని మీరు సందేహపడ నక్కరలేదు—రేపు ఆదివారం నాటికి అంతా సిద్ధం చేయిస్తాను.'' అన్నాడు రామారావుగారు.

ఇంతవరకూ చూస్తున్న పెద్దమనిషి అన్నాడు. "అయ్యా! భాగవతారు గారూ, ఒక కృతిని అని మమ్మని ఆనందింపచేయండి.''

వాసు జవాబు లేకుండా చూస్తూ గుటకలు మింగుతున్నాడు.

ఇంతలోనే దేముడిలాగా రామారావుగారుఅన్నారు "శీతయ్యగారూ! తొందర ఎందుకు? రేపు ఆదివారంనాడు పాటకచ్చేరీ జరుగుతుందిగా— ఇప్పుడు పక్క వాయిద్యాలు లేకుండా విద్వాంసులపాట రాణించదు.''

వాసుగాడికి అప్పటికి ఆగండం తప్పింది. మళ్ళీ ముఖంలోకి కొంచెం

ధైర్యం తెచ్చుకొని నిజంగా భాగవతారులాగానే కూర్చున్నాడు.

రామారావుగారు ఒక దాసీదాన్ని పిల్చి కమలను రమ్మని ఖబురు చేశాడు. కమల వచ్చింది. వాసు ఇదివరలో కమల ఎట్లా వున్నా తనను పెళ్ళి చేసుకోటానికి ఏమీ అభ్యంతరం ఉండగూడ దనుకున్నాడు. ఇట్లాంటి సందర్భాలలో ఏవో గొంతెమ్మ కోరికలు పెట్టుకొని కూర్చుంటే లాభంలేదు, వీలునుబట్టి పోవలె అని గూడా తెలుసును. కాని ఇప్పుడు కమలను చూస్తే తను కలలోకూడా అనుకోని అందం ఆమె దగ్గరవుంది. ఇదంతా ఆ ఈశ్వరుడి మహేంద్రజాలం అనుకొని పట్టలేని ఆనందం అనుభవించాడు.

రామారావుగారు కమలతో అన్నాడు, "అమ్మా! వారినిచూచావా?- వారు నీకు సంగీతం మాష్టరుగారు. వారు ఎవరు అనుకున్నావో?— సుబ్బయ్య భాగవతారుగారు. వారి శిష్యురాలు అని చెప్పుకొంటేనే చాలు—శీతయ్యగారు, మనంపోయి ఆ కాగితాలు ఒకసారిచూదామా?- సుబ్బయ్య భాగవతారుగారూ, ఆదివారంనాడు పాటకచ్చేరి అయిన తరువాత కమలకు పాఠం చెప్పటం మొదలు పెడుదురుగాని—ఇక నేను పోతాను."

* *

వాసూ కమలా మిగిలిపోయినారు గదిలో. ఏం మాట్లాడాలో వాసుకి తెలియదు. మాట్లాడాలని ఆదుర్దాగాకూడా లేదు. ఎట్లా జారుకుందామా అని ఆలోచిస్తున్నాడు.

నవీన మర్యాదలు బాగా తెలుసును కనక కమలే సంభాషణ మొదలు పెట్టింది.

"ఏమండీ, మీరు మద్రాసు ఎప్పుడు వచ్చారు?"

"పొద్దునే మెయిలు దిగానండీ."

"తమదేవూరు?"

ఏవూరో? సుబ్బయ్య భాగవతారుది ఏవూరో ఆయన పుట్టుపూర్వోత్తరాలు ఏమిటో తెలుసుకోకుండా రావటం పొరపాటు అనుకున్నాడు వాసు. కాని ఆలోచించటానికి టైంలేదు. ఆయంది తూర్పు అని మటుకు తెలుసు.

"విశాఖపట్నం దగ్గర ఒక వూరు."

"విశాఖపట్నం దగ్గర నా?—ఎవరో మీది విజయనగరం అన్నట్టు జ్ఞాపకనే!"

"అంటే నేను విజయనగరం మహారాజు వారి దగ్గిరికి తరచు పోతూ వుంటాలేండి. మా గ్రామం విజయనగరానికి విశాఖపట్నానికీ మధ్యగా వుంటుంది. అందుకని మాది విజయనగరమనికూడా అంటూవుంటారు."

కమల ధర్మానా మీ గ్రామం పేరేమిటి అని అడగలేదు! లేకపోతే గోదావరి జిల్లాలో తనకు తెలిసిన వూరిపేరు చెప్పేవాడే.

మళ్లీ కమల అంది, "ఏమండీ, మీకు కోపం రాకపోతే, మీవయసు యెంతో తెలుసుకోవాలని వుంది."

కమలకి తన వయసు ఎందుకో వాసుకి బోధపడలేదు. సుబ్బయ్య భాగవతారు వయసు యెంతో ఇప్పు డెవరు చెపుతారు? తప్పకుండా పెద్దవయసువాడు అయి వుంటాడు. 60 సంవత్సరాలు అని అంటే కమల నమ్మనూ నమ్మదు; ఒకవేళ నమ్మితే తన ప్లాను లన్నిటికీ భంగంకూడా వస్తుంది. ఈ సందిగ్ధంలో ఏం చేస్తాడు?

"నా వయస్సు 35, 40 సంవత్సరాలని అందరూ అనుకుంటారుగాని న్యాయానికి మీతో చెపుతాను, నాకు 25 సంవత్సరాలకంటె లేవు." అన్నాడు ధైర్యంగా.

"26 సంవత్సరాలకే ఇంత గొప్ప వారైనారా, మీరు?" అంది ఆశ్చర్యంగా.

"అంటే పుట్టుకతోనే సంగీతంతో పుట్టాను. నేర్చుకుంటే ఇంతవిద్య ఎక్కడన్నా వస్తుందా?"

కమల చూపులు, సందేహాస్పదంగా నేవున్నాయి, కాని మాట్లాడలేదు. చివరకు అంది "మీరు ఇక్కడ భోజనానికి వుండండి" అని.

"క్షమించండి. నా స్నేహితులు నాకోసం ఎదురుచూస్తూ వుంటారు. మరొకప్పుడు వుంటాను. ఇవ్వాళిటికి పోనివ్వండి." అని సెలవు తీసికొని ఆ ఇంట్లోనుంచి బయట బడ్డాడు ఆసారికి.

  

గ్రామారావుగారు మాట అంటే తప్పేవాడు కాదు. ఆదివారంనాటి పాట కచ్చేరీకి ఆయన శక్తివంచన లేకుండా ప్రయత్నం చేశాడు. తన స్నేహితులు కొందరికి టిక్కెట్లు అమ్మి కొంత డబ్బుకూడా వసూలు చేశాడు. ఆ డబ్బులో కొంత ఖర్చుకుగాను వాసుకుగూడా యిచ్చాడు. రూపాయి మొహం చూచి ఎన్నాళ్ళో అయింది వాసు. ప్రాణాలు లేచి వచ్చినయి. విరివిగా ఖర్చు పెట్టాడు. నాకు ఆ రోజుల్లో రెండు పూటలా కాఫీ ఇప్పించేవాడు.

విద్యార్థులలో గూడా అమ్మమని రామారావుగారు ఎరిగిన విద్యార్థి కి ఒకడికి యిచ్చాడు. వాడు మా గదికి కూడా వచ్చి మమ్మల్ని కొనమని ప్రాణాలు తీశాడు.

"ఏ అరియక్కుడి రామానుజం అయ్యంగారిదో పాటకచ్చేరీ అంటే అరవవాళ్లు వందలకు వందలూ వస్తారు-మన తెలుగు వాళ్లకి తెలుగువాళ్లు అంటే అభిమానం లేదు. స్టూడెన్సుకి అర్ధ చార్జీగూడా చేస్తే మీకేమిటి కొనటానికి అభ్యంతరం?" అని నిష్ఠూరంగా అన్నాడు.

ఎంత ప్రయత్నించినా నాకు నవ్వు ఆగటం లేదు. "అబ్బాయీ, ఎందుకు? ఈ సుబ్బయ్య భాగవతారు పాట కచ్చేరీ నాకు తెలుసును" అన్నాను. వాసు కొంప మునిగి పోయినట్టుగా నా వంక చూస్తున్నాడు.

"నాదగ్గర డబ్బు లేదు; నామాట విను—నన్ను చంపక" అన్నాను మళ్ళీ ఖచ్చితంగా.

ఇక లాభం లేదని నన్నొదలి వాసుతో, 'ఏమండీ, మీరు?' అన్నాడు.

వాసు అసలే అర్థంలేని చూపులు చూస్తున్నాడు. వాడు ఈ ప్రశ్న వేయగానే జవాబు లేకుండా ఇంటి కప్పు వంక చూశాడు. అప్పుడు నేను వాడి సహాయం వెళ్ళి "వాడేమిటి కొనేది?--వాడు చాకిరీ బాయ్ నీకు తెలియదు గామాల్ను" అన్నాను. అంతటితో మమ్మల్ని వదిలి వెళ్లాడు.

వాడు వెళ్ళిన తరువాత వాసూ నేనూ ఒకరి మొహం ఒకరం చూచుకొన్నాం. ఇద్దరికీ నవ్వొచ్చింది.

"వెధవపని చేసి నవ్వుతావేం ఇంకా!" అన్నాను.

"వెధవపని ఏమిటిశీ?"

"ఈ పాటకచ్చేరీ ఏమిటీ?"

"ఏం? నేను చెయ్యలేననా?"

"నిజంగా చేదా మనుకుంటున్నావా ఏమిటీ?—బూట్లు తీసుకు కొడతారేమో!"

"పాటకచ్చేరీ అంటే నువ్వేదో మహా కష్టమనుకుంటున్నావు గాని అంతకంటె సులభమైంది ఏదీ లేదు."

"ఏదో కిటుకు కనిపెట్టి నట్టున్నావే? నాక్కూడా చెప్పురూ!" అన్నాను. వాడు తగులుకొని ఒక చిన్న వుపన్యాసం ఇచ్చాడు.

"ఇప్పుడు—

రామ నీకు తగిన చిన్నదీ

జనక రాజ తనయ వున్నదీ

ఈ పదం వున్నదనుకో—అసలు ఏపదం అవసరమే లేదు. ఏదో ఒకటి రెండు అక్షరాలు పట్టుకొని వాటిని సాగదీయవచ్చును. ఒక అక్షరం అన్నగంటకు రెండోది అంటాము కనక మొదట ఏమన్నామో ఎవరికి జ్ఞాపకం ఉండదు. సంగీతంలోసంవచ్చిన వాళ్లెవరూ అర్థం అవుతుందా లేదా అని చూడరు. 'రామనీకు తగినచిన్నదీ' వున్నదనుకో, మొదట 'రా' పట్టుకో రా-ఆ-ఆ-ఆ-ఆ అని ఒకటి రెండు నిమిషాలు సాగతీయి-ప్రతిపాటకచ్చేరికీ ఫిడేలు వాడుంటాడుగా-వాడి వంక తీవ్రంగా చూడు. ఆపాట్న వాడు ఫిడేలు వాయించటానికి తగులుకుంటాడు. ఒక అరగంట సేపు చూస్తూవుంటే అరగంటసేపూ వాయిస్తాడు. అయితే అప్పుడప్పుడు ఫిడేలు బాగా వాయిస్తున్నాడే అన్నట్టుగా తలవూపాలె. వాడికి వుత్సాహం ఎక్కువ విడువకుండా తగులుకుంటాడు. వాణ్ణి మంచిచేసుకుంటే పాడేవాడికికూడా క్షేమం.

"ఫిడేలు వాడిని ఒక అరగంట అయిన తర్వాత, మద్దెలవాడి వంక కొంచెం కోపంగాచూడు. ఆపాట్న వాడు మద్దెల్ను బాదటం మొదలు పెడతాడు. మద్దెలవాడికి ఎక్కువ ప్రోత్సాహం యివ్వకూడదు. వాణ్ణి అప్పుడప్పుడు ఫకా, ధికా, తో ధంకా అని దబాయించాలె; వాడు శోభవ మొహం వేసికొని మద్దెల వూరికే కొట్టుకుంటాడు. చివరకు అర

గంట అయింతర్వాత బలే మద్దెలవాడు దొరికాడు అన్నట్టుగా ఆడియన్సు కేసి తల వూపాలె, లేకపోతే వాడికి మరీకోపం వస్తుంది.

"ఇట్లా ఒకగంట గడుస్తుంది. తర్వాత 'రామజోమ' అన్నానసలే, లేకపోతే మళ్ళీ 'రా' అన్నానసలే అదీ ఇదీ కాకపోతే 'సా' అన్నానసలే ఇంకోటిపట్టుకో. దాన్ని ఒక నిమిషం ఎట్లాగోట్లా సాగదీయి. మళ్ళీ ఫిడేలువాడివంకో మద్దెలవాడివంకో, మొదట చెప్పినట్టుగా కనిపెట్టి చూడు. వాళ్లు తగులుకొని చెరోక అరగంట వూపిరి ఆడకుండా వాయిస్తారు. వాళ్ళకు తెగ చెమటలుపోస్తయి. పాటకచ్చేరీచేసే వాడిక్కూడా తల అమితంగా వూపటంచేత, చేతులతో తొడల మీద కొట్టుకోటం చేత, వాడికీ చెమటపోస్తుంది. అప్పుడు ఆడియన్సు అందరూ పాటకచ్చేరీ బాగుందనుకుంటారు.

"అదికాకుండా ఆడియన్సులో పెద్దపెద్దవాళ్ళూ, బాగా సంగీతం వచ్చుననుకునేవాళ్ళూ, కొంతమంది ప్రతి పాటకచ్చేరీకీ ముందువచ్చి కూర్చుంటారు. వాళ్ళను బాగా కనిపెట్టి వాళ్ల వంక అప్పుడప్పుడు తిరిగి ఎక్కిరించినట్టుగా మొహాలుపెట్టి, సరిగ్గా గరిగ్గా మరిగ్గా పధప్పా, ధనిస్సా, గరిస్సా అంటూ ఆబండబూతులు పెట్టాలె. దాంతో వాళ్ళకి బాగా అప్పీలయి పాట బాగావుందని తలవూపుతారు. వాళ్ళని చూచి మిగతాసంగీతం సంగతి తెలియని వాళ్ళుకూడా అంతేకామాల్ను అనుకుని తలలు వూపుతారు. అప్పుడు పాటకచ్చేరీ రక్తి కట్టుతుంది."

"ఏదో మంచి రక్తికట్టించేటట్టేవున్నావే పాటకచ్చేరీ, నేను టిక్కెట్టన్నా కొనుక్కోలేదు!" అన్నాను వుపన్యాస ధోరణిలో కొంచెం సందు దొరికితే.

'టిక్కెట్టు కొనుక్కోపోతే ఏంకి-గొప్పగొప్ప సంగీతపాటకులందరికీ శిష్యులు వుంటారు—నీవు నాశిష్యుడిలాగా వేషం వేసుకురా.'

"ఏడిచినట్టేవుంది!—నీకు తగిలే దెబ్బలు కొన్ని నేకూడా తినాలిసి వస్తుంది. నీ ఏడుపు నువ్వే ఏడు" అన్నాను.

* * *

శనివారం వచ్చింది. ఆదివారం నాడే పాటకచ్చేరీ. వాసు పాటకచ్చేరీ చేయగలననే హుమస్సులోనే వున్నాడు. నేచెప్పినా వినేట్టుగా లేడు.

వాడికిమంచి శాస్తి అవుతుంది— ఈ దెబ్బతో వొదిలికూడా పోవచ్చును— అనే ధైర్యంతోవున్నా నేను.

సాయంత్రం 3 గంటల ప్రాంతాన్యల వేషం వేసుకొని బయలుదేరాడు.

"ఎక్కడికిరా?" అన్నాను.

"నువ్వట్లా అపశకునంగా అడుగుతే ఎట్లా? వెళ్ళేపని చెడుతుంది" అన్నాడు నొచ్చుకున్న మొహంతో.

"అయితే కొంచెంసేపు కూర్చో-అపశకునబలం పోతుంది" అన్నాను.

కూర్చున్నాడు. వాడు రామారావుగారింటికి బయలుదేరాడనీ నాకు తెలుసు. ఏదోప్లాను మీద వెడుతున్నాడు. ఏంప్లానో నాకు తెలియదు. అడుగుతే మళ్లీ అపశకునం అయింది అంటాడని వూరుకున్నాను.

"ఇహ వెళ్లొచ్చు" అన్నాను. వెళ్ళాడు.

రామారావుగారిల్లు చేరుకున్నాడు. అడపాదడపా వెళ్తూ వస్తూవుండడంవల్ల అక్కడవాళ్ళందరికీ బాహా పరిచయం కలిగింది. సరాసరి లోపలికిపోతే అడ్డగించే వాళ్లు ఎవరూ లేరు. రామారావుగారు ఇంట్లో లేరు. కమలను కలుసుకున్నాడు.

"మీనాన్నగారు ఇంట్లో లేరా?"

"అప్పుడే కోర్టునుంచి రారు—కొంచెంసేపు కూచోండి, వస్తారు."

సావకాశంగా కూర్చున్నాడు. ఏదోమాట్లాడాలని వుంది. కాని ఎట్లా మొదలు పెడదామా అనే ఆదుర్దా మొహంలో కనిపిస్తూంది.

"మీరు, పాట కచ్చేరీ చేసే గామాల్ను, తయారుగా వున్నారా?" అంది కమల.

"పాట కచేరీకి తయారు ఏమిటి? నేను ఎప్పుడూ సిద్ధమేగా." అన్నాడు.

సంభాషణ కొంచెంసేపు అపుదల అయింది. వాసు మొహంలో ఆదుర్దా అట్లాగేవుంది. "మీకు పిల్లలున్నారా?" అంది కమల.

"నా కింకా పెళ్ళికాలేదు."

"మీకు పెళ్ళి కాకపోవటం ఏమిటి?—ఎవరుపడితే వాళ్లు పిల్ల నిస్తారు మీకు."

"నిజమే. కాని ఇంతవరకెవరూ నా బుద్ధికి నచ్చలేదు. అందుకని పెళ్లి చేసుకోలేదు. నాకు నచ్చిన వాళ్లు కనబడితే అందుకు సిద్ధంగానే వున్నా."

"ఇంతవరకూ ఒక్కరూ కనిపించలేదా ?"

"నువ్వు కనిపించావు" అని అందామనుకున్నాడు కాని ధైర్యం లేక పోయింది. "కనిపించనట్టే" అన్నాడు.

కొంచెం ఆగి మళ్లీ మొదలుపెట్టి "అంటే" అనిఏదో చెప్పబోయినాడు.

కమల అడ్డంవచ్చి "మీసంగతి అంతా తమాషాగ వుందే!" అంది.

వాసు కొంచెంసేపు వూరుకుని మళ్లీ మొదలుపెట్టాడు. "మీతో—"

మళ్ళీ కమల అడ్డంవచ్చి "పోనియిలెండి—ఏదన్నా ఒక చరణం పాడండి, వినాలని కుతూహలంగా వుంది" అంది. కమల అడ్డం వచ్చిం దని వాసు కొంచెం విసుక్కున్నట్టుగా చూశాడు.

"పాటకేం?—రేపేగా పాటకచ్చేరీ—మీరు నాకు దగ్గరగా కూచుని విందురుగాని లెండి."

"ఇప్పుడు ఏం తోచటంలా. పాట వినాలని వుంది."

"ఇప్పుడు పక్కవాయిద్యాలు లేకుండా విద్వాంసుల పాట రాణించదు." అన్నాడు రామారావుగారి మాటలు జ్ఞాపకం పెట్టుకుని.

"నేను అడుగుతే నా కోసరమయినా పాడగూడదా?" అంది.

"మీరు ఎవరితో చెప్పనని చేతిలో చెయ్యి వేస్తే ఒక రహస్యం చెపుతాను."

"చెప్పండి."

"చేతిలో చెయి వెయ్యండి."

"వేసినట్టే అనుకోండి."

"నేను అసలు సుబ్బయ్య భాగవతారును కాను. ఒకందుకు ఈ వేష మంతా వేసుకొచ్చాను."

"ఏమిటేమిటీ!" అంది ఆశ్చర్యంతో.

"ఈ శ్రమ అంతా ఎవరికోసం పడుతున్నానో మీకు తెలుసునా?"

"ఆఁ—?" అంది ఆశ్చర్యంతో.

"నన్ను— నేను—నాకు—నిన్ను—నీకు—నీతో—పెళ్ళి! —ఏం సరేనా?" అన్నాడు తడబడుతూ.

కమల మొహంలో వున్న ఆశ్చర్యానికి తోడు కోపంగూడా చేరింది.

"ఓరి తప్పుడు ముండా కొడకా!–అమ్మోయి!–అమ్మా!–చూడవే!"

"అరవకు! — పూర్కా! — ఒకమాట విను—" అన్నాడు భయంతో బతిమాలుతూ.

కమల ఇంకా బిగ్గరగా "అమ్మోయి!–అమ్మా!–మాట వినేదేమిట్రా?" తప్పుడు గాడిద కొడకా?–అమ్మా!–ఇట్రావే!" అంటూ లోపలికి గది లోకి పోయింది. వాసు అక్కడ ఒక్క క్షణం వుండకుండా నురుగులు కక్కుతూ, ఎవరన్నా వెంట తరుము కొస్తున్నారేమో నని వెనక్కు తిరిగి తిరిగి చూస్తూ, గది చేరుకున్నాడు.

ఆయాసంతో వూపిరి ఎగపీలుస్తూ "మేలుకు!–మేలుకు!–" అన్నాడు.

"ఏమిట్రా!" అన్నా, నాకు అర్థంకాక.

"ముందు వెళ్లాలి—5 రూపాయలు సహాయం చేసి–నన్ను కాపాడు" అన్నాడు. "మరి పాట కచ్చేరీ?" అన్నాను.

"అంతా అయిపోయింది!"

నాకు అయిపోయిందంటే ఆశ్చర్యం వేసింది. అర్థం కాలేదు. "సరే, అట్లాగే ఇస్తాలే 5 రూపాయలు" అని చెప్పి నెమ్మదిగా కూచోపెట్టి జరిగిన సందర్భం అంతా తెలుసుకున్నా.

విన్న తరువాత వాసుకు 5 రూపాయలు ఇవ్వకుండా తీసుకువెళ్లి రామా రావుగారికి పట్టిద్దామని బుద్ధి బాగా పుట్టింది. కాని నేనే పస్తాయించా. వాడికి అంత అపకారం చేయలేకపోయినా, వాడొదలిపోతే ఇక నాకొక్కవలసిందేమిటి ?

వాసుకి 5 రూపాయిలు యిచ్చి, వాడితోగూడా స్టేషనుదాకా వెళ్ళి టికెట్టు కొనిపెట్టి, రైల్లో ఎక్కించి, మళ్ళీ తిరిగిరాడు అనే నమ్మకం చిక్కింతర్వాత గదికి చేరుకున్నా. అంతే—మళ్ళీ వాడి సంగతి తెలియ లేదు. ఇప్పుడు నీవు వాసుకు పెళ్ళి అయిందని చెప్పుతూంటే ఆశ్చర్యంగా వుంది, వాడికి పిల్లను ఎవరు ఇచ్చారా, అని.

# మొదటిసారి

ఱ్రవి ఎండాకాలపు శెలవలు. ఆ మిట్టమధ్యాన్నమప్పుడు మాక్కూడా (అంటే రాముడు బావకూ నాకూ) ఎండ అనిపించడంవల్ల ఇంటిపట్టున వుండాలిసివచ్చింది— కాక మాది పల్లెటూరు. మా నాన్నగారు గూడా వూళ్లో లేకపోవటంచేత చీట్లపేక ఒకటి సంపాదించి దాంతో తీర్చుకుంటున్నాం మా పరీక్షల బడలిక అంతా.

ఆ సావిట్లోనే మొత్తనానుకుని మా అత్తయ్యా, ఆమెకెదురుగా మా అమ్మా కూర్చుని తెంపులేకుండా రాచకార్యం చేస్తున్నారు. మధ్యమధ్య మాఅత్తయ్య వత్తులు చేస్తూంది. మా అమ్మ పీట పెట్టుకుని మినుముల్లో రాళ్ళు చేస్తూంది.

చీట్లాటలో రాముడికీ నాకూ తగాదావచ్చింది. తప్పు వాడిదే. ముక్క చెయి జారిపడ్డది; ప్రమాణ పూర్తిగా నేను దిగాలని దిగలేదంటాను. వాడది నమ్మక అరవటం మొదలు పెట్టాడు.

"ఏమిట్రా—ఆగోలా? మాట తోచుకో నివ్వకుండా గల్లంతు చేస్తున్నారు?—పాడు చీట్లపేకా మీరునూ!—అడుగో మామయ్య వస్తున్నాడులే-మీపని చెపుతా వుండండి!"అని కోపంచేసింది మా అత్తయ్య.

చెప్పుల చప్పుడు గూడా వినపడింది. నేను వంగి వీధి గుమ్మం వైపు చూచాను.

"నిజంగానే వస్తున్నాడ్రో!—చీట్లు చాపకిందికి తొయ్యరాచప్పున" అన్నాను ఆదుర్దాతో.

ఆయన్నుచూస్తే మాకు హడలు. మాకే కాదు మా అమ్మకూ—మా అత్తయ్యకూ—మా వూళ్ళోవాళ్లకూ చివరకు మా జిల్లాలో వాళ్లందరికీ కూడా ఆయనంటే భయమే.

మీది కృష్ణాజిల్లా అయితే శీతారామయ్యగారి పేరు వినివుండకతప్పదు. ఆయనలేని వ్యాజ్యం ఆ కోర్టుల్లో వుండదు. మా చుట్టుపక్కల వూళ్ళ వాళ్ళందరికీ ఆయన్ను చూస్తే భయమూ కోపమూ. అట్లా అని ఆయన దగ్గరకు రాక ఎవడికీ తప్పదు.

ఆయన స్వచ్ఛమయిన బ్రాహ్మణ్యం జరుపుతూ వుండటంవల్ల కూడా కొంత గౌరవమూ సంపాదించాడు లోకంలో. ఇంట్లో దేవతార్చనా, బ్రహ్మ యజ్ఞమూ, పితృతర్పణా, వగైరా రెండుగంటలు చేసేవాడు. వాయిదాలకు బస్తీకిపోతే ఏం చేసేవాడో తెలియదు. బహుశా మనస్సు రాయి చేసుకుని పూటకూళ్ల ఇంట్లో నే తినేవాడు అనుకుంటాను.

ఆయన వైద్యం కూడా కొద్దిగా చేసేవాడు. ఎప్పుడో పూర్వము ఎవరెవరికో తను మందులు ఇచ్చినట్లూ, వాళ్లంతా బతికినట్లూ చెప్పేవాడు. కొంతమంది ఆయన మాటలు నమ్మి ఆయన ఇచ్చిన మాత్రలు పుచ్చుకునే వాళ్లు. వైద్యాని కని ప్రత్యేకం డబ్బు పుచ్చుకునేవాడు కాడు. కాని అన్నిటి వారా ఏ వ్యాజ్యంలోనో తీసేవాడు.

కొందరు బయట అధికారం చలాయిస్తూ, ఇంట్లోకి రాంగానే పిల్లికూనల్లాగా అయిపోతారు. కాని మా తండ్రి ఆ తరగతివాడు కాదు. అందుకు కారణం మా అమ్మ ఏమో నాకు తెలియదు. మా అత్తయ్యా రాముడూ పెద్ద ఆస్తిపరు లయినప్పటికీ, రాముడికి తండ్రి పోవటం చేత వాడి ఆస్తి మా నాన్నే మానేజీ చేస్తున్నప్పటికీ, వాళ్లకు కూడా ఫారాగతాలు లేవు ఆయనకు ఎదురు చెప్పటానికి.

మా తండ్రి గొప్ప తెలివిగలవాడనీ, గొప్ప చదువు లేక పోయినప్పటికీ, పెద్ద ప్రయోజకు డనీ, ఆయన్ను చూస్తే, సామటుకు నాకు, భయమే కాక, భక్తికూడా వుంటూ వుండేది.

అందుకనే ఆయన వస్తున్నాడని మా అత్తయ్య అనగానే చీట్లను చాపకిందకు వెంటనే తోసి, చేతి కందిన పుస్తకాలను చెరొకటి తీసుకొని చదువుతున్నట్టు నటిస్తూ కూర్చున్నాము.

ఆయన వచ్చి, మమ్మ నందరినీ ఒకసారి తేరిపార చూచాడు. చెప్పులు విడుస్తూనే చెప్పాడు: రెండువేల కట్నంతో రాముడికి మార్చివారి సంబంధం కుదుర్చుకు వచ్చాననీ, రేపు దశమి నాటికి లగ్నమనీ, మా అందరికీ—అంటే రాముడికీ, నాకూ, మా అత్తయ్యకూ, మా అమ్మకూ—విన పడేటట్టుగా—ఏ ఒకళ్ళతోనో చెప్పినట్టుగా కాక—ఒక సభలో వుప

న్యాసం ఇచ్చే ధోరణిలో—పెద్ద గొంతుతో చెప్పాడు. మాలో ఎవళ్లో "ఇట్లా చేశావేం?" అని పొరపాటున అంటే విరుచుకుమీద పడేటట్లు చూచాడు.

ఆయన ఆముక్క అన్నప్పటినుంచీ, లగ్నంవరకూ మాలో మాకు జరిగిన సందర్భాలు—అంటే రాముడు నా ప్రోత్సాహంతో, వాళ్లమ్మ దగ్గరకు వెళ్ళి—చిన్నతనంలో, చదువు పూర్తి కాకమునుపు--అంట్లో కట్నాలు గిట్నాలు తీసుకొని—పెళ్ళి చేసుకోటం అనేది తన వుత్కృష్ట ఆశయాలన్నిటికీ భంగకరమని అర్థం వచ్చే మాటలు కొన్ని గొణగటం,—వాళ్ళమ్మ "నోరు మూసుకోరా, నాయనా!—మామయ్య వినిపోతాడు!" అని ఒకే సమాధానం ఎన్నిసార్లయినా చెప్పటం;—చివరకు రహస్యంగా చొక్కాలని పేరు పెట్టి, నూరు రూపాయలు మా అత్తయ్య మాకు ఇవ్వటం;—చొక్కాలు, చుట్టాలు పెళ్లికొడుకును చెయ్యటం సరదాలలో పడి రాముడు తన వుత్కృష్ట ఆశయాలన్నీ మరిచిపోవటం—ఇవన్నీ ప్రస్తుతం అనవసరమయిన డిటెయిల్సు.

* * *

పది పన్నెండేళ్ళ క్రితం—ఆ రోజులు వేరు—ఆ పెళ్ళిళ్ళు వేరు—ఆ సరదాలు వేరు. ఇప్పుడు యీ పెళ్ళిళ్ళు ఏం పెళ్ళిళ్ళు?—ముఖ్యంగా ఏ ముగ్గురో ఏ సైజాపో వెళ్ళటం—రెండు పూటలు గడిపి రావటం—పెళ్ళి అయిందని పుకారు వెయ్యటం!—శారదా బిల్లు!—పాడు శారదా బిల్లు!--

పెళ్లివారి "బళ్ల"ల్లో ఎక్కి తర్లి పోవటం బహు సరదాగా వుండేది. "తర్లి పోవటం" అంటే—మజిలీలూ—భోజనాలూ—బోల్తాలూ—చద్దివణ్ణాలూ—మన ప్రాప్తాన్నిబట్టి, దొంగలూ—మధ్య మధ్య కొంచెం కొంచెంగా ప్రయాణంగూడా వుంటుంది.

ఎందుకో "బళ్ల"న్నీ చీకట్లో అమాంతంగా ఆగుతయి.

"ఎందుకురా, ఆపారు?—సాగి పోనీయండి!—" అని అరుస్తావు చివర బండిలోంచి. జవాబు వుండదు. బోల్తా కావచ్చు, దొంగలు కావచ్చు, ఇంకా ప్రమాదమయింది ఏదైనా కావచ్చు. కర్రా లాంతరూ తీసుకొని, బండి దిగి, విచారణకు పోతావు. కారణం కనపడదు.

అనవసరంగా ఆపినందుకు ముందు బండివాణ్ణి కేకలేస్తావు. వాడికి కోపం వస్తుంది.

"యేూందండి?—కిష్టయ్యగోరూ?—మీరు ఎప్పుడూ ఇంతేనండీ!—లోకువగా వున్నాం గదా అని మా మీదండీ మీకూకలూ! (బండిలో వాళ్ళకేసి తిరిగి) 'యాామండీ!' శాసమ్మగోరూ!-మీరు సెప్పండీ!—'ఆపళ—ఆపళ!' అని కేక లెట్టలేదండీ, ఓరో?" అని అంటాడు.

"అవునురా, అబ్బాయీ!—అల్లాగే వినపడ్డాయిరా మా కూడా—" అని ఆవిడగారు సాక్ష్య మివ్వటం—అప్పటికి అరగంట అవుతుంది. తీరా లగ్నం మించిపోతుందేమోనని బతిమాలి బళ్లు సాగ తీస్తావు.

ఇంతకూ చెప్పొచ్చిందేమిటంటే-ఇట్లాంటి అవస్థలు అన్నీ పడకుండా నే "బళ్ళు" కట్టుకుని లగ్నంనాటి పొద్దుటికల్లా చేరుకున్నాం రాముడి అత్తవారి వూరు.

చిన్న పందిరివేసి తోరణాలు కట్టబడిన డాబా ముందు బళ్లు ఆగినయి. "అంతా దిగండి, ఇదే పెళ్ళివారి విడిది" అన్నారు ఎవరో.

బళ్లవాళ్లు పెట్టెలు దింపి, ముందు సావిట్లో మూలగా పెడుతున్నారు. ఆడవాళ్లతో, పిల్లలతో, బళ్ళవాళ్ళతో పెద్ద గల్లంతుగా వుంది.

ఇంతలో మా నాన్నగారి పెద్ద గొంతు వినపడ్డది. "ఒరే సుబ్బన్నా-ఆ పెట్టె అక్కడ కాదురా, వేరే వుంచాలిరా!" అని, నన్ను పిలిచి తను వరపూజకు తొందర చెయ్యటానికి వెళ్తున్నాననీ, ఆ పెట్టెను పక్క గదిలో భద్రపర్చమనీ చెప్పి పోయినాడు.

నేను దానిని పట్టుకొని లోనికిపోయినా. మెల్లాకు రెండు వైపులా గదులున్నయి. ఏదో తెలియక ఒక గదిలో ప్రవేశించాను.

"ఎవరది?" అని సన్నని చక్కని గొంతు వినపడ్డది.

ఒక నిమిషం పాటు చిత్తరపోయి చూచాను. ఆమెకు 20 సంవత్సరములు వుంటయి. ఆమె అద్దంలో చూచుకొని దువ్వుకుంటూంది. నొక్కులు నొక్కులుగా వున్నజుట్టు మరి కొంచెం నొక్కులు పడుతున్నది. ఆమెకళ్ళు నాకు ఇప్పటికిగూడా మరుపురాకుండా వున్నయి. అంతవరకూ ఆడవాళ్లా

అంటే ఎవరో అన్నట్టుగా వుంటే నాకు ఒక్కసారిగా హృదయం పొంగిపోయింది. ఆమెను అట్లా చూస్తూ ఏళ్ల తరబడి అన్నం నీళ్ళు లేకుండా నిల్చోగల ననిపించింది.

"ఎవరండీ?" అన్నది మళ్ళీ, నావంక చూస్తూ.

"పెళ్ళివారం" అన్నాను నా సహజమయిన బ్రెర గొంతుకు సిగ్గు పడుతూ.

"అయితే."

"మా నాన్నగారు ఈ పెట్టె ఏదోగదిలో పెట్టమన్నారు."

"ఎవరు? సీతారామయ్యగారా? తండ్రిగారా?" ఆమె కళ్ళలో కొంచం ఆశ్చర్యం కనిపించింది.

"ఈ గది కాదు. ఆ ఎదురుగా వున్న గది ఖాళీ చేశాం మీ కోసం. అందులో పెట్టండి" అంది. ఆమె గొంతుకలోకి ఒక విధమయిన మార్పు వచ్చింది. అప్పటినుంచీ నాతో చిరపరిచయం గలదిలాగా, ఎంతో చనువుగా, మాట్లాడటం మొదలు పెట్టింది.

నేను పెట్టె తీసుకుని ఎదురుగా వున్న గదిలోకి పోయినా. దానిని కిందపెట్టి, మళ్ళీ ఆమె గదిలోకి ఏమిష కల్పించుకుని పోదామా అని ఆలోచిస్తూ కూర్చున్నా పెట్టెమీద.

ఇంతలో ఆమె తాళం ఒకటి తీసుకొని నా గదిలోకి వచ్చింది. "తాళం మీరు తెచ్చుకున్నారో లేదో అని ఒకటి వెతికి పట్టుకొచ్చాను. ఈ ఐదు రోజులూ దీనిని మీరు వాడుకోండి," అన్నది.

నాకు మాట్లాడటానికి ఏమీ తోచలేదు. ఆకర్షిస్తూన్న ఆమె పెద్ద కళ్లల్లోకి చూస్తూకూర్చున్నా. ఆమె అందిస్తూన్న తాళాన్ని అందుకున్నా.

ఆమె ఒక్క నిమిషం ఆగి కొంటెతనంగా నా వంక చూస్తూ "మీకు ఇంకా ఏమయినా కావాలా?" అన్నది.

ఏమి కావలెనని చెప్పను? మాట్లాడే శక్తి అంతా ఒక్క సారిగా పోయినట్టుగా చూస్తూ కూర్చున్నా.

ఆమె గది విడిచి పోవటానికి సిద్ధమయింది. పోతూ మళ్లీ వెనక్కు

తిరిగి, ఆ అందమైన చూపులు నామీద విసిరి "ఒకవేళ ఏమయినా కావలిస్తే నన్ను అడగండి, నేను ఇక్కడే వుంటాను." అని వెళ్ళిపోయింది.

దేవలోకంలోంచి ఒక్కసారిగా మాయామాలు ప్రపంచంలో పడ్డట్లయింది.

"పోయె నయ్యో ఇపుడు ననుబాసి..." అనే కీర్తన జ్ఞాపకం వచ్చింది. మన గొప్ప యాక్టరు ఒకాయన స్టేజిమీద ఒక వింగునుంచి ఇంకో వింగువరకూ గంతులేసి ఆక్టు చేసినట్టుగా చెయ్యలేను కాని జ్ఞాపకం వచ్చినంతమట్టుకూ ఆ చరణాలు అనకుండా వూరుకో లేక పోయినా.

* * *

మొదటి రోజునే ఆమె పేరు కనుక్కున్నా. ఆమె పేరు లక్ష్మి. ఆమె ఇంటి ఆవిడ కూతురు. తల్లీ కూతురూ తప్ప ఇంట్లో ఎవరూ వున్నట్లు కనిపించలేదు. లక్ష్మి మొగుడు ఎక్కడ వున్నాడో తెలియదు. ఏ దేశాంతరాల్లోనో చదువుతున్నాడేమో. వివరాలు బాగా చెప్పేవాళ్లు కనిపించలేదు.

ఆమెకు నాకంటే మహావుంటే ఒక ఏడాది వుండొచ్చు, కాని ఆమెతో మాట్లాడుతున్నప్పుడు నాకంటె ఎంతో పెద్దది అనిపించేది.

మొదట్లో ఆమెతో మాట్లాడటం బెరుగ్గావుండేది. కాని రానురాను ఆమె మూలంవల్ల నేను కూడా చాలా చనువుగా మాట్లాడటం నేర్చుకున్నాను.

లక్ష్మి నేనూ రోజుకు వందసార్లయినా కలుసుకునేవాళ్లం పళ్ళుతోమేటప్పుడూ—ఊరేగించే టప్పుడూ—పాటలు పాడేటప్పుడూ—మేజువాణీ చేసేటప్పుడూ—ప్రమాదము లేకుండా ఆమెకు ఎంత దగ్గరలో వుండగలిగితే అంత దగ్గరగా వుండేవాణ్ణి. ఆమె పూట కొకవిధంగా సింగారించుకుని వచ్చేది. అప్పుడప్పుడు నామీద ఓరచూపులు విసురుతూ వుండేది. ఆ రోజుల్లో వాటితోనే జీవిస్తూ వుండేవాణ్ణి.

పేర్లు చెప్పాలసి వచ్చినప్పుడు నేను ఆడవాళ్లలోకి చొరవజేసుకొని వెళ్ళి, "ఇవ్వాళ నువ్వు ముందు చెప్పాలిరా పెళ్ళాం పేరు రాముడూ" అనేవాణ్ణి. అట్లాంటప్పుడు లక్ష్మి నాపక్కనే వుండటం తటస్థించి, పెళ్లి

కొడుక్కు వత్తాసుగా వచ్చి, "అమ్మా!—అల్లా కాదండీ-మీఅమ్మాయే ముందుగా చెప్పాలి" అనేది. అది పెద్ద హాంశంలాగా వాగ్వివాదంపడే వాళ్లం. చివరకు "ముందు మీరు చెప్పకండి" అని ఆమె అంటే-"ముందు నీవు అసలు చెప్పకమ్మ" అని నేను పెళ్లికూతుర్ని హెచ్చరించేవాణ్ణి. అందరూ తలోకమాటా అనేవాళ్లు. చివరకు ఎవరో ముందు చెప్పేవాళ్లు. రాముడు పెళ్లాంపేరు చెప్పగానే నాకు 'వినబడలేదు, మళ్ళీ, చెప్పమనే వాణ్ణి. పెళ్లికూతురు పేరు చెప్పినప్పుడు లక్ష్మి గూడా అంతే చేసేది. చివరకు గంటసేపటికి పేర్లుచెప్పటం తంతు పూర్తి అయ్యేది.

అప్పుడప్పుడు ఒంటరిగాకూడా మేం కలుసుకునే వాళ్లం. నేను గది లోకి పోయినప్పుడు, ఆ గదిదగ్గరకే ఆమె గూడా వచ్చేది. ఏదో పని వున్నట్టుగా వీలుగావుంటే పలకరించేది. నేనుగూడా ఏదో అవుసరంలేని ప్రశ్న వేస్తూ వుండే వాణ్ణి. "ఏమిటి? మళ్ళుకట్టుకొని భోజనాలకు పోతూవుంటే మీరు ఇక్కడే వున్నారేం?" అనో—లేకపోతే "వూరే గింపుకు రారా?" అనో అనేవాణ్ణి.

అయితే మొదటి రోజునుంచీ మేం ఇద్దరం ఎంతమందిలో వున్నా, ఏం మాట్లాడుతున్నా, ఏం మాట్లాడకపోయినా, మా ఇద్దరి మధ్యా లోకానికి తెలియని ఒక రహస్యం వున్నట్లు, మా చూపులలో ఒక అర్థం వున్నట్లు వుండేది. మేము సంబంధంలేని అనవసరమయిన హాంశ ములను గురించి మాట్లాడుతున్నప్పటికీ, నాహృదయ భావమును ఆమె అర్థం చేసుకున్నట్లు ఆమె నావంక చూచేది.

మూడో రోజు మధ్యాహ్నము గామాల్ను నేను ధైర్యంచేసి, ఆమె గదిలో ఒంటరిగావుంటే కనిపెట్టి గదిలో ప్రవేశించాను. ఆమె "ఏమి టిది" అన్నట్టుగా చూచింది.

అక్కడ హార్మోనియం ఒకటి కనిపించింది. వెంటనే ఒక మిష కని పెట్టాను. నాకు ఏమీ తోచనట్టూ, ఆమె దగ్గర హార్మోనియం వుందని తెలిసినట్టూ, ఆమె నడిగి వాయించుకుందామని వచ్చినట్టూ నటించాను. ఆమె నేను పెట్టిన మిషకు తృప్తిపడ్డట్టు కనిపించింది, గాని ఇంతలో

మా నాన్న గొంతు వచ్చి మా సంభాషణ పూర్తిగా చెడగొట్టింది.

"వోరే!—ఎక్కడరా?—అబ్బాయీ!" అని తన పెద్ద గొంతుతో కేకలు పెట్టాడు. నేను ఆమె గదిలోంచి వచ్చాను భయపడుతూ.

"ఏం చేస్తున్నావురా, ఇక్కడ?"

హార్మోనియం అంటే పట్టిస్తుందేమోనని "తెల్ల కాగితం కావలసి ఇంటి వారిని అడుగుతున్నా" అని అబద్ధం ఆడాను. లక్ష్మి నా మాటలు వింటూ గూడా పూరుకుంది.

"సరేగాని, నీవు వెంటనే సైకిలు వేసుకుని పేటకు వెళ్ళి, 2000 మల్లె పూలు కొనుక్కు రావాలి—ఇక్కడ వున్నట్టుగా రావాలి—చూస్తావేం ఇంకా?—పోక!" అన్నాడు. ఎట్లాగో బయటపడ్డాం గదా అని సంతోషించి లక్ష్మివంక చూడకుండా సైకిలు ఎక్కిపోయినా.

* * *

నేను తిరిగి ఇంటికి వచ్చేటప్పటికి గంటయింది. పూలబుట్ట మా అమ్మచేతి కిచ్చాను. లక్ష్మి అక్కడే వుంటే ఆమెను ఒకసారి సూచనగా చూచి వచ్చాను. మెల్లాలో పని వున్నవాడిలాగా తారట్లాడుతున్నా ఆమెకోరకు.

నా చూపును అర్థం చేసుకొని తప్పక వస్తుందని నా ధైర్యం. కాని ఆమె అర్థం చేసుకోలేదేమోనని భయం. ఐతే రెండుమూడు నిమిషాల్లో నే నన్ను అర్థం చేసుకున్నట్టుగానే లోపలికి వచ్చి, పని వున్నదానిలాగా తన గదిలోకి వెళ్ళింది, వెంబడే నేనుకూడా వెళ్ళాను వెనకా ముందూ ఆలోచించకుండా.

వెనక్కు తిరిగి నావంక చూచింది "ఎందుకు?" అన్నట్టుగా.

జేబులోంచి, మధ్య గులాబి పువ్వూ, చుట్టూ మల్లె పూలతోనూ చెమికీ తోనూ అమర్చబడినటువంటి ఒక చెండును బయటకు తీసాను.

"ఇదిగో" అన్నాను.

"ఎక్కడిది?"

"నీ కోసరమని నేను కొన్నాను."

"నాకెందుకు?"

"నీవు తల్లో పెట్టుకుంటే బాగుంటుంది."

"చాల్లేండి మీ మాటలు."

"చాల్లేండి లేదు—ఏం లేదు—నీవు అలా మాట్లాడకు—నీకోసమని నేను కష్టపడి తీసుకొస్తే!" అని, ఆమె చేతిని పట్టుకుని, అరచెయ్యి తెరిచి, ఆ చేతిలో చెండును వుంచాను. ఆమె ఎదురు మాటాడక నా వంక చూస్తూ నిల్చుంది.

అక్కడితో నా ధైర్యం ఖర్చయి పోయింది. ఎందుకనో ఆమె వంక కన్నెత్తి చూడలేక పోయినా, పెద్ద తప్పు చేసినవాడిలాగా. అప్పుడు మా నాన్న నన్ను చూచి వుంటే చంపేస్తాడని తోచింది. అంతట ఆ గదిలోంచి వెనక్కు ఒక్క పరుగు తీశాను.

ఎవరికీ కనపడకుండా తిరిగాను గంటా గంటన్నర. నేను ఇట్లా చేశానని లక్ష్మి మాఅమ్మతో చెపుతుందనీ, మా అమ్మ మా నాన్నతోనూ, ఇతరులతోనూ చెపుతుందనీ భయం వేసింది. చివరకు ధైర్యం చేసి సాయంత్రానికి పెళ్లివారింటికి వెళ్లాను. అక్కడ మేజువాణి జరుగుతోంది. నన్ను ఎవరూ వింతగా చూడలేదు మా నాన్నగాని, మాఅమ్మగాని. లక్ష్మికూడా అక్కడే వుంది. నా కొరకే గామాల్ను అటూ ఇటూ చూస్తూంది. నేను ఇచ్చిన చెండు జెడలో పెట్టుకుంది. నన్ను చూచి చిరునవ్వు కూడా నవ్వింది. అప్పటికి ధైర్యంవచ్చింది. నేను అనవసరంగా భయపడ్డానని తెలుసుకున్నా.

* * *

మర్నాడు నాలో ఒక విధమయిన ఉద్రేకమూ, ఉత్సాహమూ పుట్టింది. ఎనిమిదింటినుంచీ గది దగ్గర ఏదో పని వున్నవాడి లాగా నటిస్తూ కాపలా కాస్తూ కూర్చున్నా. లక్ష్మి ఒంటరిగా గదిలో చిక్కిందంటే పట్టుకుని హృదయం విప్పి చెప్పుదామని నా ప్రయత్నం. ఆమె చాలాసార్లు ఆ దారిన నడిచింది, నన్ను ఓరగా చూచింది, కాని నాకు సావకాశ మివ్వలేదు. ఒంటరిగా గదిలో కాలుపెట్ట లేదు.

కాని నేను నిరుత్సాహుణ్ణి కాలేదు. భోజనాలకు ముందు ఆమె గదిలోకి రావలసిన అవసరం కలిగినప్పుడు, నేను ఇంకా అక్కడే వుండటం చూచి

ఏదో ఒక పిల్లను వెంటతోడుగా తెచ్చుకుని గదిలో కావలసిన వస్తువు తీసుకుని వెళ్లిపోయింది. అప్పుడు నాకు నిరుత్సాహం కల్గింది. ఆమె నన్ను స్పష్టంగా ఎడం చేస్తూందని తెలుసుకున్నా. నాకు కారణం తెలియలేదు. ఏడుపు గూడా వచ్చింది.

కాని మధ్యాహ్నం పూర్తిగా నిరాశ చెందక వేరు సంధా లోకొన్నాను. అక్కడే గొంతు మీద కూర్చున్నట్టు కాకుండా వీధిలోకి వెళ్ళి కనపడకుండా లక్ష్మిజాడలు కనిపెడుతూ నిల్చున్నా. ఆమె నేను లేను గదా అని నమ్మి గదిలోకి వెళ్ళినప్పుడు పోయి, దొంగను పట్టుకున్నట్టు పట్టుకుందామని ప్లాను వేశా.

ప్లాను పారింది. మూడుగంటల షుమారుకు లక్ష్మి నిశ్చింతగా గదిలోకి వెళ్ళింది ఒంటరిగా. నేను వెంటనే ఇంట్లో మెల్లాలోకి, జారవడ్డాను. అక్కడ అదృష్టవశాత్తూ ఎవరూ లేరు. గదిలో మటుకు ఆమె అలికిడి వినపడుతూంది.

సరాసరి గదిలో ప్రవేశించి, ఆమెకు మాట్లాడటానికి ఒక్కనిమిషం కూడా సావకాశం ఇవ్వక, రెండు చేతులూ పట్టుకుని దగ్గరకు లాక్కుని, రెండు బుగ్గల మీదా రెండు వేడి ముద్దులు పెట్టాను.

"తప్పు—పూరుకో—ఎవరన్నా వస్తారు—నన్ను వదులు—."అన్నది మెల్లిగా అర్ధ స్థాయిలో.

"పూరుకోను—పొద్దుటి నుంచీ నన్ను—ఎట్లా ఏడిపించావు?"

"ఏం?"

"నేను నీ కోసం—వేచుకున్నా నని నీకు తెలుసుగా?"

"నేను ఒంటరిగా చిక్కితే, ఇట్లాంటి పని చేస్తా వనికూడా నాకు తెలుసు."

"మరి నే నెట్లా పూరుకోను?"

"ఇప్పుడు కాదు—ఎవరో వస్తున్నారు—రాత్రికి—"

"ఒక్క ముద్దు—"

"కాదు-రాత్రికి-రాత్రికి-" అని నన్ను తప్పించుకుని పారిపోయింది.

ఆ్రా సాయింత్ర మంతా కాలచక్రం తిరుగుతున్నట్టు నాకు కనిపించ లేదు. నా కాళ్ళు భూమి మీద నడుస్తున్నట్టుగా లేదు. రాత్రి సంగతి ఆలోచనలోకి వచ్చి, గుండె గబగబా కొట్టుకొంటూంది. మా నాన్నను చూచినప్పుడల్లా, నా ఉద్రేకమునూ, నా పరధ్యానమునూ కనిపెట్టి అనుమాన పడతాడేమో నని భయము. అంను కని సాధ్యమైనంత వరకూ మా నాన్నను తొలిగి వుంటున్నా.

ఒక్క సారి అయన నన్ను పట్టేసి "ఏమిట్రా, అబ్బాయీ?-వైభవంగా పెళ్ళి అవుతూంటే నీ జాడ ఎక్కడా కనపడదు?-పొద్దాకులూ ఏం చేస్తూంటావో?—చేతికి అక్కర కొచ్చిన వాడవు. ఒక్క పని సంబాళించుకోలేవు?-ఇంకా ఎన్నాళ్ళకురా మీకు జ్ఞానంవచ్చేది?" అని నాలుగూ జాడించాడు. మాటాడ లేక పిల్లిలాగా జారుకున్నా.

రాత్రి కొరకు ఎంత వుత్సాహ పడుతున్నానో, అంత భయం గూడా పడుతున్నా. ఎంత రహస్యంగా చేసినా, మా నాన్నకు తెలియకుండా ఏ పనీ నేను చేయలేనని నాకొక భయము. నాప్లాను లన్నిటికీ అయన సైంధవుడు లాగా అడ్డుపడి, నన్ను పట్టేస్తాడని నా కొక పెద్ద అనుమానము. కాని యముడంత వాడికి భయపడికూడా లక్ష్మిని వదలలేను. అవాంతరంవచ్చి పడ్డా సరే రాత్రి కొరకు నిరీక్షిస్తున్నా.

లక్ష్మి మీద ఒక కన్ను వేసి వుంచాను సాయింత్రమంతాను. ఆమె తనకు ఏమీ జరగనట్టు మామూలుగా మేజువాణీల్లో, పాటల్లో, ఊరేగింపుల్లో మునిగి తేలుతూంది. నావంక నన్నా చూడటం మానేసింది. కాని ఆమె మనస్సులో నన్ను గురించే ఆలోచిస్తున్నదని నాకు తెలుసును. మాగ్రంథం చాలా దూరం పోయిందని ఆమె పస్తాయిస్తున్న దేమోనని నాకు అప్పుడప్పుడు అనుమానంకలిగేది. ఆమె పవిత్రతను మలినం చెయ్యటం నాకు భావ్య మయిన పనా అని గూడా ఆలోచించాను; కాని ఆమె సాన్నిధ్యం కొరకుండా వూరుకో లేక పోయినా, రాత్రి ఎప్పుడు వస్తుందా అని కనిపెట్టుకు కూర్చున్నా.

రాత్రి భోజనాలు అయ్యే టప్పటికి పొద్దు పోయింది. ఎదురుకోలు అయ్యేటప్పటికి 12 అయింది.

లక్ష్మి రాత్రిళ్లు పడుకోటం ఆ గదిలోనే. నేను రహస్యంగా గది

లోకి రావటానికి సావకాశం ఇస్తుందని నా నమ్మకము. తొందర పడకుండా చుట్టు పక్కల తారట్లాడుతున్నా.

మా నాన్న ఎదురుకోల అయింతరువాత కనిపించలేదు. ఇది కూడా శుభసూచకంగానే వుంది అనుకున్నా.

ఒక్కొక్కరే ఏదో ఒక చాపో, జంపకానో చూచుకుని సావిట్లోనో పంచలోనో పడుకుంటున్నారు.

లక్ష్మి పడుకునే ప్రయత్నం లేకుండా ఏదో రాచకార్యం చేస్తూనే వుంది. చివరకు కొంత సేపటికి లేచి లోపలికి వెళ్ళింది-తన గదిలోకి. వెంటనే కొక కొంచ మాగి, ఎవరూ చూడకుండా గదిలోకి పోదా మని నా ఆలోచన. ఆమె నా కొరకు తప్పక తలుపు తీసి వుంచుతుం దని నా ఆశ.

అర గంట ఆగి మెల్లిగా మెల్లాలోకి వెళ్ళాను. గది వాకిట్లో చాప వేసుకుని ఎవరో పడుకున్నారు. నిదానించి చూచాను. ఆమె లక్ష్మి తల్లి. ఆమె నా అలికిడి కనిపెట్టి "ఎవరు వారు?" అంది. "నేను" అన్నాను. దేని కొరకో వెతుకుతున్నట్టు నటించి, గది తలుపు లోపల వేసివున్నట్టు గ్రహించుకుని ఇవతలకు వచ్చాను.

నాకు ఒక విధ మయిన నిరాశ వచ్చింది. లక్ష్మి తల్లి రాక్షసి లాగా ప్రత్యేకం నా కొరకే నియమింప బడ్డట్టుగా ఆ తలుపును కాపాడు తూంది. లక్ష్మి లోపల తప్పక వుందని నాకు తెలుసును. నిస్పృహాతో ఒక చాపవుంటే దాని మీద పడుకున్నా. కళ్ళ వెంట నీళ్ళు గూడా వచ్చినయి.

కొంత సేపటికి ఒక వూహ తట్టింది. ఆ గదికి రెండో తలుపు దక్షిణ వైపు చిన్న దొడ్డోకివుంది. ఆ దొడ్లో ప్రవేశించానంటే తలుపు గుండా లక్ష్మిని మెల్లిగా పిలిచి గదిలో ప్రవేశించవచ్చు నని తోచింది.

ఈ వూహ పుట్టిన తర్వాత ఒక్క నిమిషం పడుకోలేదు. దక్షిణవైపు దొడ్డి వాకిలిదగ్గరకు వెళ్ళాను. నేను అనుకొన్నట్టుగానే తలుపు లోపల గడియవేసివుంది. గోడ దూకితేనే గాని దొడ్లో ప్రవేశించలేను.

గోడదూకటం నాకు అట్టే కష్టంగా కనిపించలేదు. కాని, ఎవరన్నా చూస్తే దొంగలని వెంట పడతారేమోనని భయం వేసింది. అందుకని

నాలుగు పక్కలా పరీక్షించి చూచి, చూపు మేరలో ఎవరూ లేరని రూఢి చేసుకుని, ఒక వూపుతో గోడ యెక్కి అవతలకు దూకాను, చప్పుడు లేకుండా,

గదిలో లాంతరు వెలుగుతూంది. తలుపు భార్లగా తీసివుంది నాకోరకే నని అనుకున్నా. ఐనా ఎందుకయినా మంచిదని, వెన్నెలలో గోడ నీడ వుంటే ఆ నీడలో నక్కి గది దగ్గరకు వెళ్ళాను. లక్ష్మి మంచం మీద కూర్చుని తనలో తాను నవ్వుకుంటున్నట్లు కిటికీలోంచి కనిపించింది. ఇక ఆగలేక "లక్ష్మీ" అని అంటూ గదిలో ప్రవేశించాను.

నా పిలుపు వినగానే లక్ష్మి గాభరాపడుతూ లేచి నిల్చుంది. ఆ తొందరలో రెండు నోట్లేవో ఆమె చేతిలోంచి జారి కింద పడ్డయి. ఆ క్షణంలోనే మంచంమీద ఎవరో లేచి కూర్చుంటున్నారు. అది ఎవరో కాదు మాతండ్రి శీతారామయ్య!

నేను స్తబ్దుడ్ని అయిపోయినా. నోట మాట రాలేదు.

ఆయన లేచి కూర్చున్న తర్వాతగాని నన్ను చూడలేదు. నన్ను ఓరగా చూచి గుర్తుపట్టి తక్షణమే నాకు మొహం కనపడకుండా దుప్పటి ముసుకు వేసుకున్నాడు. మందమతి ఐన నేను ఆయన్ను చూడలేదనీ, అథవా చూచినా గుర్తుపట్టి వుండననీ ఆయన ఆశపడ్డాడు గామాల్ను. ఆయనంటే వుండే గౌరవమూ భయమూ ఒక్కసారిగా పోయినయి. ముసుకు వేసుకుంటేమటుకు ఈపిరికిపంద నన్నెట్లా తప్పించుకు పోగలడు అనుకున్నా.

ఆ ముసుగుతోనే మెల్లిగా లేచి, గోడవైపు మొహంపెట్టి ఎండ్రకాయలాగా వాకిలిదాకానడిచి, దొడ్డోకిదూకి కనపడకుండా పారిపోయినాడు.

ఇంతలో లక్ష్మి "ఏమిటి-ఇట్లా ఎందుకు వచ్చావు" అన్నది.

"నీవు ఇంతదానివి అని తెలియక" అన్నాను కోపంతో.

అంతే, ఇక అక్కడ ఒక్క క్షణంగూడా వుండలేదు. గది తలుపు తీసుకుని మెల్లాలోకి వచ్చాను.

తలుపు చప్పుడు కాగానే పడుకున్న ముసలిది మేలుకొని "యెవరు వారుళ్ళీ" అంది మళ్ళా.

"నీవు ఇక్కడ కాపలా కూడానా!" అని నా కసి తీర ఒక తన్ను తన్నిపోయినా.

# మన కథకుడు

మొండు వేసంకాలంలో ఒకరోజున బాగా పొద్దెక్కిన తర్వాతనే కొంచెం దూరపు వూరికి నేను కర్మవశాత్తూ ప్రయాణం చెయ్యవలసి వొచ్చిందని—ఎక్కువ ఉపోద్ఘాతం లేకుండా—చెపితే మీరు నన్ను నమ్మొచ్చును. కర కట్టమీదట కాలిబాటన నేను నడుస్తున్నాను. నాకు చేతిప్రక్కన కృష్ణానదీ-నదిలో పురుగుల్లాగా పడవలూ-అక్కడక్కడ రేవుల్లో బట్టలు పైకి ఎగకట్టి, వచ్చిపొయ్యే వాళ్లను చూస్తూ, గుడ్డలు చాచి వుతికే చాకలి పడుచులూ-ఇవన్నీ ఆనందం కలుగచేస్తున్నాయని భావించుకోటానికి ప్రయత్నం చేశాను.

దారిపొడుగూనా పెరుగుతట్టలూ, కట్టెల మోపులూ నెత్తిన పెట్టుకొని అమ్ముకోటానికి, బస్తీకి పోతూ వింతవింత షడుచులు ఎదురైనారు. ఎవరో వెనకవుండి వీళ్లందర్నీ నాకొరకు—నా యిష్టంవచ్చిన వాళ్లని కోరుకోమని-ఒక్కొకరినే లైనుగా పంపిస్తున్నట్టుగా వుంది. ఒక్కొకరే చూపు మేరదూరంలోపుట్టి, మూడు నిమిషాల్లో పెద్దవాళ్లయి—నాకు చాలదగ్గిర వాళ్ళయి- నాకళ్ళల్లోకి-భయంగా - నిర్భయంగా - చింతగా-నిశ్చింతగా-గూఢంగా-నిగూఢంగా-సంతోషంగా-శాంతంగా-సిగ్గుగా - కొంటెగా-విధవిధాలుగాచూచి, తాకేటంత దగ్గిరగా ఒచ్చి, కొంచెం పక్కకు తొలిగి, మాయమై పోతున్నారు. వాళ్ల భావతరంగాలు ఏమిటి? వాళ్లహృదయమూలకూ, నా హృదయానికీ, ఈ దాటరాని దూరం ఎందుకు? హృదయాన్ని చూచేశక్తి హృదయానికి వుంటే, లోకం ఇట్లా వుండదుగదా!

ఇదంతా వేదాంతం! ఎండ అనుకోక ప్రకృతి అందాలను చూచి తనివి తీర ఆనందిద్దామని వుద్దేశించిన నేను ఎట్లాగో బురదలాంటి వేదాంతంలో పడ్డాను. ఇంతలో దూరాన వినవస్తూన్న ఒకపాట నన్ను ఆబురదలోంచి పైకి లాగింది.

ఒకపుట్ట దాటాను, ఒకమలుపు తిరిగాను. చెట్టునీడనఎవరో, ఒక్కడూ కూచుని పాడుకుంటున్నాడు. తనపాటను తను తప్పక ఆనందిస్తూ గూడా

వుండి వుండాలె. ఆత్మానుభవాన్నిపట్టి అల్లాంటప్పుడు పాట పసలేక పోయినా కలిగే అనందానికి కొదవ వుండదని చెప్పగలను.

"రాగసు...సుధారస...పానము...చేసి..." అని పాడుతున్నాడు.

"పానము"లో "పా"ను సాగదీసి, బిగ్గరగా, నోరంతా తెరిచి వుచ్చరిస్తూంటే, అసలు పాటకు ఎక్కువ లాహితీ కాకపోయినప్పటికీ, అర్థానికి చాలా అనుగుణంగా వుందని చెప్పక తప్పదు.

మళ్ళీ "రాగసుధారస పా—" దాకా పాడి అక్కడ నన్ను చూచి, అర్థాట్టుగా ఆగిపోయినాడు. నేను దగ్గరికి వెళ్ళేటప్పటికి నన్ను చూచి ఆపినట్టుగా వుండకుండా—వినపడీ వినపడకుండా—గొణుగుపాట పాడుతున్నాడు.

మొహం చూస్తే చదువుకున్న మొహంలాగానే వుంది. కళ్ళజోడు పెట్టుకొన్నాడు. గడ్డం మీసం నాజూగ్గా పెంచాడు. లాల్చీ తొడుక్కున్నాడు. అద్దకం వేసిన ఖద్దరు వుత్తరీయం వల్లెగా వేసుకున్నాడు.

"ఏమండోయి !—అయ్యా!"

దగ్గరికి వెళ్ళాను.

"మీ దగ్గర అగ్గిపెట్టె వుందా?"

జేబులోంచి వెతికి తీసి ఇచ్చాను.

అది తీసుకుని చేతిలోపట్టుకుని కొంచెంఅనుమానిస్తూ, "సిగరెట్టుకూడా వుందా?" అన్నాడు. లిటరేచరు ఆటలో డైమనురాణీవుందా?—కళావరు రాజు వుందా?—అని ఒక్కొక్కటే వరసన లాగుతారే అట్లా వుంది ఈ అడగడం. సిగరెట్టు ఇస్తే వక్కలూ-తమలపాకు బీడీలూ-ఇంకా ఆ పైనీ అడిగేటట్టుగా వున్నాడు అతని వాలకం చూస్తే. అయినా చిన్నప్పటినించీ మొహమాటస్తుణ్ణి కావటంచేత లేదనలేక సిగిరెట్టుకూడా యిచ్చాను.

అతను సిగిరెట్టు వెలిగించాడు. నేను గూడా ఒకటి తీసి వెలిగించాను.

"ఎండ!—ఏ మెండ!—అదిరిపోతోంది" అన్నాడు.

అవును అన్నట్లు తలవూపాను.

"ఎందాకా మీరు?"

"కారువూడి,"

"సరే లెండి!—నేను కూడా అక్కడికే!...తోడుగా వెళ్లొచ్చు. ఎండ భరించలేక కొంచెం చెట్టునీడన కూచున్నా లెండి. ఏం, పోదామా?" అన్నాడు.

సరే ననుకొని కలిసి ప్రయాణం సాగించాము.

పదినిమిషాల్లో అతన్నిగురించి తెలుసుకోవలసిన దంతా తెలుసు కొన్నాను. పేరు అడిగితే విజిటింగుకార్డు యిచ్చాడు. దాంట్లో—

రంగా. ఎం. ఏ.

కళోపాసక్.

అని ఇంగ్లీషులో వుంది. తను కవిత్వం అల్లగలడనీ—చిత్రాలు చిత్రించ గలడనీ—పత్రికలకు వ్యాసాలూ కథలూ పంపుతూ వుంటాడనీ—సందర్భాను సారంగా నాకు తెలియజేశాడు.

ఆ పది నిమషాల సంభాషణలో అతను గొప్పగా చదువుకున్నాడనీ—చదువుకంటెను ముఖ్యమయింది—అతని అంతర్బుద్ధి, సంస్కారం అంటామే దాన్ని, సంపాదించుకుండనీ—అతని మాటలవల్లనే గ్రహించగలిగాను. అల్లాంటి ప్రముఖులు దేంట్లోనయినా తప్పక రాణించగలరు. అయితే మనది ఆంధ్రదేశంగదా!-"మధ్యతరగతికి చలామణీ జాస్తిఅండీ ఎందువల్లనో!" అని తను చలామణీ లేని ఉత్తమ తరగతికి చెందినట్టు సూచించాడు.

ఇంతలో సంతపాలెం దగ్గరికి వొచ్చాము. నాకు గొంతు ఎండుకు పోతోంది. బ్రాహ్మణ ఇల్లు వుంటే ఇన్ని మంచినీళ్లు తాగుదాం రమ్మన్నాను. రంగా ఎం. ఏ బ్రాహ్మణ ఇల్లు ఎక్కడో దూరంగా వుందిగాని తను రాన న్నాడు. తనకు అసలు దాహమే కావటం లేదన్నాడు. ఎల్లాగో బలవంతం చేసి ఇల్లన్నా చూపించమని తీసుకు వెళ్ళాను అతన్ని.

ఇంటిదాకా తీసుకువెళ్ళి తను బయటనుంచొని నన్ను లోపలికి వెళ్ళి తాగి రమ్మన్నాడు. అతన్నిగూడా, ఎండాకాలం గొంతు పిడచకట్టుకు పోతుంది, రమ్మని బతిమాలాను; రాలేదు. నేను లోపలికి వెళ్ళాను.

వసారాలో ఒక వెధవమనిషి వుంటే, "అమ్మా కొంచెం మంచి తీర్థం ఇప్పిస్తారా?" అన్నాను.

"రాజా! వీరికి కొంచెం మంచినీళ్ళు—ఇవతల బిందెలోవి—తీసుకొచ్చి ఇవ్వు—పాపం, ఎండలో వొచ్చారు." అంది.

రాజా అన్న పిల్ల మరచెంబుతో నీళ్లు తెచ్చి నా ముందు పెట్టింది. ఆమె 17, 18 ఏళ్ల వయసుగల మంచి చక్కని చుక్క. ఒక చిన్న పల్లెటూరులో అంట్లుతోముకుంటూ, పిడకలు చేసుకుంటూ, నీళ్ల బిందెలు బుజాన మోసుకుంటూ జీవితం గడపటానికి వుద్దేశించబడ్డ పిల్ల కాదు. ఆమె ఒకవేళ ఒప్పుకొని చేస్తానన్నా ఇవతలవాళ్లు చూచి సహించలేరు. ఆమె అందం అట్లాంటిది.

"ఇంకో చెంబుతోగూడా ఇవ్వండి. మరొకరుగూడా వున్నారు వీధిలో." అన్నాను ఆమెతో మాట్లాడే అవకాశానికి సంతోషిస్తూ.

"బ్రాహ్మలేనా?" అన్నది వెధవ మనిషి. నీళ్ళు తాగుతూ, అవునని తలవూపాను.

రాజా అన్న పిల్ల ఇంకో చెంబుతోగూడా మంచినీళ్లు తీసుకుని వీధి గుమ్మంలోకి వెళ్లింది. రంగా ఎం. ఏ. ను చూచే చూడటంతోనే చెంబు కింద జారవిడిచి, కెవ్వున కేకవేసి, "అమ్మోవ్! రంగాచార్లు వెధవ వొచ్చాడేవ్!" అని గట్టిగా అరిచింది.

"ఏడి!—వెధవ ఏడి!" అని వెధవావిడ పరుగెత్తింది. నేనుగూడా ఏమిటూ అని వీధిలోకి వెళ్ళాను.

రంగా ఎం. ఏ. తిరిగి చూడకుండా వీధి చివరగుండా పరుగెత్తి డొంకన పడ్డాడు. దగ్గరగా నేను దొరికాను వెధవావిడ నోటికి; విరుచుకుని నామీద పడ్డది.

"ప్రతి గాడిద కొడుకూ-ప్రతి వెధవకొడుకూ—మాయింటికి చావటానికి పనేముందంటా!-అంత వొళ్లు తెలియకుండా చస్తున్నారా!—ఒక పుట్టు వెధవ బయటనుంచుని, ఇంకో పుట్టువెధవను—కుంకను—మంచినీళ్లకని పేరుపెట్టి లోపలికి పంపిస్తాడా?-ఎవరనుకున్నారో! జాగర్త!-మనసబుతో చెప్పి ముక్కోణం తీయిస్తాను!-పుట్టు వెధవల్ని!..."

"అవ్వగారూ తొందర పడకండి—అసలు ఏమిటో చెప్పండి."

"చాల్చాలు లేవయ్యా!-నోరు మూసుకోక-సిగ్గులేక తగుగునమ్మా అని మాట్లాడొచ్చావు!-పెద్దమనిషన్న పెద్దమనిషీ!-పయిగా తొందరపడు తున్నానని కూస్తావట్రా, పుట్టుకుంటా!-ఇవ్వాళ మా పెద్దవాడే వుంటేనా, మిమ్మనిద్దర్నీ చర్మం వొలిచి అక్కడ పెట్టక పోయినాడూ!-గుడ్లు పెట్టుకుచూస్తూ నుంచున్నావేం ఇంకా-పీడ విరగడై వొదిలిపోక-ఓరి మీ మొహాలు మండా! మిమ్మని బండెడు కట్టెలతో తగలెయ్యా!-ఓరి మిమ్మని మారణహోమం చెయ్యా!......"

నేను తలవంచుకుని వీధిని పడ్డాను. డొంకలోకి పొయ్యేవరకూ కూడా వినపడుతూనే వున్నయి ఆ ఇల్లాలు గుక్కతిప్పుకోకుండా, వన్నెలు వన్నెలుగా తిట్టిన తిట్లు.

వూరికి అరమైలు దూరాన చెరువుగట్టున చెట్టుకింద కూచున్నాడు రంగా ఎం. ఏ. శాంతంగా ఏమీ జరగనట్టు.

"నా దుంప తెంచావు!" అన్నాను కోపంతో.

"నీవు నా తాడు తెంచావు!" అన్నాడు నవ్వుతూ. "అందుక నే నాకు మంచినీళ్లూ ఏపాడూ వద్దన్నాను. తాగినవాడివి నీవు దక్కారాక-ఆ రాజాను నామీదికి తోలావు!"

"ఏం జరిగింది?"

"ఏం జరగలేదు-నువు వింటూనే వుంటివిగా!"

"ఏమీ జరక్కపోతే అంత అల్లరి అవుతుందా?-ఆ వెధవముండ నన్నూ నిన్నూ కలిపి బండబూతులు తిట్టిందే!"

"కొంచెంగా వినపడ్డయి నాకూడా-అందుకనే రానన్నాను. అయిందేదో అయింది, ఇహ దారిని పోదాం పద" అన్నాడు.

"నన్ను ఇన్ని తిట్లు తిట్టించి చెప్పకపోతే వూరుకుంటానా?" అన్నాను. దారిన నడుస్తూ చెప్పటం సాగించాడు.

"వాళ్ల చుట్టాలు మా వూళ్ళో వుండటంచేత నాకు వాళ్లకుటుంబంతో కొంచెం ఎరుక వుంది. అదీకాక మా బావగారి వూరు, కారు వూడి, వెళ్తూ వొస్తూ దారిలో సంతపాలెంలో వాళ్ల యింట్లో అప్పుడప్పుడు మకాం వేస్తూ వుండేవాణ్ణి.

"రాజా అన్న పిల్ల చిన్నప్పటినించీ నా కళ్ళముందు పెరగడంచేత ఆమెతో ఎక్కువ చనువుగా వుండేవాణ్ణి.

"పదిరోజులనాడు యీ దారిని పోతూ వర్షం రావడంవల్ల ఆ రోజు రాత్రి వాళ్ళ ఇంట్లో తిష్ట వెయ్యాటం సంభవించింది.

"వసారాలో నాకు మంచం వేశారు. రాజాగూడా ఆ వసారాలోనే కొంచెం దూరంగా మంచంమీద పడుకొనివుంది. పూరు పొద్దూకకముందే భోజనాలయినయి. అప్పుడే ఏం నిద్ర వొస్తుంది? కళ్లు తెరుచుకొని పడు కొన్నాను. ఆమె తల్లి ఇంకా ఇంట్లో ఏదో పని చేస్తూనే వుంది.

"నిజంగా నాకు ఏదురుద్దేశ్యమూ లేదంటే నమ్ము. పూరికే యాదా లాపంగా పడుకున్న రాజావైపు చూశాను. చీకట్లో ఆమె కళ్ళు తెరుచు కొన్నదీ మూసుకొన్నదీ తెలియలేదు. కాని ఆమె ఆకారంమటుకు స్పష్టంగా కనిపిస్తోంది. ఆమె ఎడమకాలి బొటనవేలు అట్టా అట్టా ఆడుతున్నది. నేనుగూడా నా ఎడమకాలి బొటన వేలు అట్టా అట్టా ఆడించాను. వెంటనే ఆమె వేలు ఆడటం ఆగింది. కొంచెం వుండి ఆమె కుడికాలు బొటనవేలు కొంచెంగా కదిలినట్టుగా వుంది. వెంటనే నాకుడి కాలి బొటనవేలు పెద్దగా ఆడించాను. ఆ తరువాత కొంచెంసేపు ఇద్దరం ఏమీ ఆడించలేదు. ఇదేదో మంచి ఆటలాగా తోచింది. మళ్ళీ మొదలు పెట్టి ఎడమ కాలి బొటనవేలు ఆడించాను—ఆమె ఎడమకాలి బొటనవేలు కదలలేదు—ఏ బొటనవేలూ కదలలేదు. కొంచెం వూరుకొని కుడి కాలి బొటనవేలు ఆడించాను. తర్వాత రెండు బొటనవేళ్ళూ ఆడించాను—అది కష్టంగావుండి, రెండు పాదాలు గబగబా ఆడించాను. ఆమె తన చిన్నచిటికనవేలుగూడా కదపలేదు. నాకు విసుగు పెయ్యటం మొదలు పెట్టింది. ఆమె నన్ను నమ్మించి మోసపుచ్చినట్టుగా వుంది. కోపంగూడా వొచ్చింది.

"ఇంతలోనే ఆమె తన కుడి చెయ్యి ఎత్తి కుడివైపున పెట్టుకుంది. ఇప్పుడు దారిలోకి వొస్తున్నదనుకున్నా. నేనుగూడా ఆలస్యం లేకుండా కుడిచెయ్యి తీసి కుడివైపే కొంచెం చప్పుడు చేస్తూ వేశాను.

"నాకు బాగా ధైర్యం వొచ్చింది. ఆడవాళ్ళ ఇచ్చే ప్రేమ సూచనలు

నేను బాగా అర్థం చేసుకోగలను. అంతకంటె సూచన ఏం కావాలి? అయినా ఎందుకయినా మంచిదని కొన్ని ప్రత్యేక ప్రేమ సూచనలు నేనుగూడా చేశాను.

"అంతటితో ఆగినట్టయితే ఎంతో బాగుండేది కాని విధి!—విధి నన్ను అక్కడ ఆగనివ్వలేదు.

"నేను బయటకు పోవలసి వచ్చింది. బయటకు పోవటానికి ఆమె మంచం పక్కగా పోవలసి వుంది. పొయ్యేప్పుడే ఆమెను అట్లా ఒకసారి తాకిపోదామని కోర్కె పుట్టింది. కాని దానిని జయించ గలిగాను ఆ సారికి. మళ్ళీ వొచ్చేప్పుడు పుట్టిన ఆ కోర్కెను జయించ లేకపోయినాను. ఒక్కసారి అట్లా తాకాను. మెత్తని శరీరం వేళ్ళకు తగలగానే వొళ్ళంతా పులకరించింది. ఆమె కదల్లేదు. ఊరుకోక ఇంకోసారి గూడా...అట్లాగే చేశాను.

"ఆమె కళ్ళు తెరిచింది. నాకు కాళ్ళు వొణికినయి. దబదబా వెళ్ళి ముసుగు పెట్టుకు పడుకున్నాను.

"ఆమె లేచి ఇంట్లోకిపోయి తలుపు వేసుకుంది. అస్ఫుటంగా లోపల మాటలు వినపడ్డయి. కాని ఆమె తల్లితో చెప్పిందో లేదో తెలియదు. బయటకు మళ్ళీ ఎవరూ రాలేదు.

"నా కా రాత్రి అంతా నిద్రపట్టలేదు. తెల్లవారుఝామునే లేచి ఎవరికీ చెప్పకుండా వెళ్ళిపోయినాను.

"మళ్ళీ ఇవ్వాళ్ల నీ తెలివితక్కువవల్ల వాళ్ళ ఎదుట పడ్డాం—తినాలిసిన తిట్లన్నీ తిన్నాం" అని తేల్చాడు.

"ఏదో కొద్దోగొప్పో చదువుకున్న వాడివిగదా నీకూడా ఏమి టీ పిచ్చి?—బాటవేళ్ళేమిటి?—ఆడట మేమిటి?—ఏమిటీఖర్మం?" అని అన్నాను, వొళ్ళు మండి.

"నేను కథకుణ్ణి. నాకు వ్రాయటానికి ఇల్లాంటి స్వానుభవం చాలా ముఖ్యం— అందుకోసం పడ్డాను ఇన్నితంటాలూ—అంతకంటే దురుద్దేశ్యం నా కేమీ లేదు."

